సహకార సంఘాల ద్వారా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు గట్టిగా ప్రోత్సాహమిచ్చిన కుటీర పరిశ్రమలు అభివృద్ధియై దేశము ఆర్థిక స్వాస్థ్యము వహించును. నిరుద్యోగము నశించును. స్వయంపోషకత్వము సిద్ధించును.

వ్యవసాయముకూడ యాంత్రములపై జరుపుట మంచిది కాదు. ఎరువులు వేసి ఒకేసారి గొప్పగా పండించి పిదప నేల నిస్సారమై బీడు అగుచుండుట చూచు చున్నాము. మినూ మసాని ప్రకారము దేశములో జంతువుల పేడతో మనము ఎరువుచేసి ఎరువుగా ఉపయోగపడు దానిని కాల్చుటవలన యేటా 300 కోట రూపాయలు నష్టమగుచున్నదట. చైనా దేశములో 12 మందికి కుటుంబమునకు 2½ ఎకరాల భూమికల దట. మన దేశములో 000 మందికి 10 ఎకరాలు కూడరావు. మనుష్యుల మలము ఎరువుగా మార్చి 78000 టన్నులఎరువును చైనీయులు షాంగేలో ఉత్పత్తిని చేసినారట. మన దేశములో కూడ సుమారు 230 కోట్ల రూపాయల ఎరువును ఉత్పత్తి చేయవచ్చును.

బేసిక్ శిక్షణయందు Trench latrines ఇందులకై కల్పించిరి. ఇట్లు జంతువుల మానవుల మలము ద్వారా 983.5 కోట్ల రూపాయలు వచ్చును.

దినము 1/3 గంట వడికిన ప్రతి ఒకరు 30 గII గుడ్డను తయారు చేసికొనవచ్చును. 3 ఎకరముల పొలము కలిగి

ఒక కుటుంబము 6 మంది సుఖముగా జీవింపవచ్చును. చూచి నారా కుటీర పరిశ్రమల గొప్పతనము?

---

# వడకు పరిశ్రమ.

—:O:—

## —: ఆసనములు :—

తకిలీపై వడుకుట ఎట్లు?

తకిలీని అరచేతితో తొడపైగానీ అరకాలి భాగమందుగాని త్రిప్పుటకు కొన్ని పద్ధతులలో కూర్చుండుట అవసరము - ఈ కూర్చొను పద్ధతులను ఆసనములందురు. ముఖ్యమగు ఆసనములు మూడు గలవు.

(1) లేఖాసనము (2) అర్ధపద్మాసనము (3) సుఖాసనము

మోకాలి వెలుపలి భాగమనకును, కాలిపైనను పురి త్రిప్పుటకు లేఖాసనమును తొడపై పురి పెట్టుటకు అర్ధపద్మాసనముగాని సుఖాసనముగాని వీలుగానుండును.

లేఖాసనము:—

తకిలీని వేగముగా త్రిప్పవచ్చును. నూలును ఎక్కువ పొడుపుగ తీయవచ్చును. అర్ధ పద్మాసనము, సుఖాసనము

లందు పై ఆసనమునందంత వేగముగా త్రిప్ప లేము. నూలు వడకునపుడు లేఖాసనమునందు పీటైనంత వఱకు బారతీ యుట కష్టము. నూలుతీసిన తరువాత దానిని తకిలీకి చుట్టుటకు తకిలీని తొడనుండి చాలదూరము తీసికొని పోవలెను. లేదా ఏకును పట్టుకొన్న చేతిని చాలపైకి ఎత్త వలసివచ్చును. ఈ ఆసనములపై చాలసేపు కూర్చుండ వచ్చును.

సూచన:—

ఏ ఆసనముపై కూర్చుండినను తకిలీని పురిపెట్టుటకు పయోగించుటకు భాగమునందలి వెండ్రుకలను కత్తిరించుట మంచిది. లేనియెడల తకిలీ వానియందు చిక్కుకొనును— ప్రతిరోజు వడకుచున్నచో ఆభాగమందు వెండ్రుకలు పెరుగవు. వీనిని కత్తితో తీసివేయుట మంచిదికాదు — అట్లుచేసినచో రాపిడికి ఆభాగమున మంటకలుగును—తకిలీని పురిపెట్టుటకు పయోగించు భాగము నేలకు ఎత్తుగానుండునట్లు కూర్చొన వలెను.

సుఖాసనములో కుడిచేతితో నూలు వడకవలెనన్న మొదట కుడిపాదము లోపలికి తీసికొని తరువాత ఎడమ పాదమును తొడక్రిందకు తీసికొనవలెను— అందువలన కుడి తొడ కొంచము యెత్తుగానుండును. పై ఆసనములలో కూర్చొని వడకుటలో నుపయోగింపబడు భాగములను తెరచి యుంచుటకు ఆభ్యంతరములు గలవారు ఆభాగము పై వస్త్ర

ములను తీయకనే వడకవచ్చును. ఆభాగముపై మాలు గాని తోలుపట్టీగాని కప్పవచ్చును. కాని ఆరుమాలు ముడతలు పడరాదు. లేకున్న అరికాలుపై గూడతీయ వచ్చును.

వడకుటకు కావలసిన సాధనములు:—

(1) తకిలీ, (2) ఏకులు, బూడిద, అట్ట, లపేటా, తకిలీ తిన్నగనుండవలెను— వంకరగనున్నచో పూర్తియైన వేగమురాదు— దరుదరులాడి నూలు తెగును. తకిలీ సాధారణముగ బరువున్నచో ఎక్కువ వేగమున తిరుగును. తకిలీపైన కొంచము వంకరగా కొక్కెమునకై యుంచవలెను. అట్లున్న యెడల తకిలీకి చుట్టిన నూలువడకు నప్పుడు జారదు. కాని చుట్టు నప్పుడు దానినుండి నూలును విడదీయుటకు కష్టమగు నట్లుగూడ కొక్కెముండరాదు. తకిలీతో వడకునప్పుడు ఈ కొక్కెమును ఏకుచివర పెట్టి నూలుతీయుటకు సహాయపడును. కొక్కెముగలకొన మిక్కిలి మొనతేరి యుండరాదు. కొక్కెము చివర పదునుగా నుండరాదు. అట్లున్నచో చేతి యందు గ్రుచ్చుకొనవచ్చును. తకిలీపైనున్న కొక్కెమునంటి భాగము యొక్క నూలుకన్న (1/3") ఎక్కువ వెడల్పున్నచో తకిలీకి గాలి యొత్తిడి హెచ్చును. పొడవు సుమారు 6 1/2" నుండి 7 1/2" వరకు యుండవచ్చును. దండముయొక్క వ్యాసము 1/2" నూలుకన్న హెచ్చుండరాదు. తక్కువ

యుండ వచ్చును— దండము లావుగనున్న వేగము తగ్గును. మిక్కిలిసన్నముగ నున్నచో అతివేగముగ తిరుగును— కాని త్వరగ వంగిపోవును. పూరిపెట్టుట కూడకష్టము— గొడుగు ఊచకన్న లావుగనున్న తిరుగుటలో వడితగ్గును.

అట్ట:—

సాధ్యమైనంతవరకు తక్కువ మడతలు, గరుగు కలిగి యుండవలెను—సమతలముగ నుండవలెను— లేనియడల తకిలీ స్థిరముగ నుండదు— కాగితములను సమతలముగ స్థలమునం దుంచవలెను. లావుపాటి అట్టనుగాని, సన్నని కొయ్యపలకను గాని యుపయోగించ వచ్చును. కాని తకిలీకొన అరిగిపోవును. తిరుగు నప్పుడు చప్పుడు చేయును. అందువలన దీనినెక్కువగ నుపయోగించరాదు.

లపేటా:—

ఒకచుట్టు 4' పొడవుండ వలెను. లపేట సాధారణ ముగ $11\frac{1}{2}'$ పెడల్పు 3" పొడల్పు 1/4" మందము యుండ వలెను. రెండుకొనలు కొంచెము గుండ్రముగనుండ వలెను. అందుచే నూలు బయటకు తీయుట సులభము నూలు తెగదు

వడకుట:—

వడకుటకు పూర్వము చేయవలసిన యేర్పాట్లు

(1) ఏ ఆసనముపై కూర్చొని వడకదలచిన అదే ఆసనము పై స్థిరముగ కూర్చొన వలెను.

(2) వెలుతురు కంటిపై పడకుండ నూలుపై మాత్రముపడు ప్రదేశమునందును, గాలియిసుయునకు నూలు తెగనిచోట వడక వలయును.

(3) ఏకులను ఎడమచేతిలోనుంచి బూడిదను కుడిప్రక్క అందుబాటులోనుంచు కొనవలెను.

(4) ఏకులను ఎడమవైపు మోకాలివద్దగాని తొడపైగాని కాగితమునందుంచు కొనవలెను.

(5) ఏకు చివరను బొటనవ్రేలు ఉంగరపువ్రేలు చివర తోను పై భాగమును చూపుడువ్రేలు మధ్య వ్రేలు నడుమను పెటవలెను. క్రొత్తగా నేర్చుకొను వారు మొదట తకిలీని కాగితముపై పెట్టి తకిలీకొక్కెము యొక్క సహాయముతో యొక అంగుళము లేక రెండంగుళములు నూలుతీసికొంచెము పురిపెట్టవలెను. తరువాత తకిలీనిఆపి మరల యొకటి లేక రెండంగుళ ములనూలు తీసి పురిపెట్టవలెను. ఈవిధముగ కొంత నూలు తీసిన తరువాత వడకుట పురిపెట్టుట యను నీరెండు పనులు వెంట వెంటనే చేయుచుండవలెను. ఈ అభ్యాసము పూర్తియైన పిమ్మట తకిలీని యొకే పర్యాయము వేగముగా పురిపెట్టి ఆ చేతిని నూలు

పైకి తీసుకొని వచ్చి వడకుచుండవలెను. ఈ అభ్యాసముగూడ పూర్తియైన పిమ్మట అరచేతితో పిక్కపైగాని తొడపైగాని వడకుట ప్రారంభింపవలెను.

ఫురిపెట్టుట:—

నూలు వడకు యితర సాధనములకంటె తకిలీయందొక ప్రత్యేకత గలదు. ఒకేసారి పురిపెట్టి రెండుచేతులును నూలు తీయుట కుపయోగించ వచ్చును. పురిపెట్టుటకు 2 పద్ధతులుగలవు. (1) చిటికెలతో పురిపెట్టుట (2) బొటన వ్రేలు, చూపుడు వ్రేళ్ళతో, తకిలీని పట్టుకొని చూపుడు వ్రేలును బొటన వ్రేలుపై గట్టిగ నొక్కుచు మన వైపులాగుకొనినచో తకిలీని వదలిక గలుగును. వ్రేళ్ళయొక్క బలము తగ్గుట వలనను వ్రేళ్ళ పొట్టివియైనను వేగముగా త్రిప్పుటకు వీలుపడదు. అందువలన ఈపద్ధతిని త్వరగా వడుకలేము.

అరచేతితో పురిపెట్టుట:—

అరచేయి వ్రేళ్ళమధ్యను తకిలీని పట్టుకొని పిక్కపైగాని తొడపైగాని రాయుచు అరచేతిని నడుమనైపులాగుట చేత తకిలీకి వదలిక గలుగును. తకిలీని వేగముగ త్రిప్పుటకు ఇది ఉత్తమ పద్ధతి. నూలుతీసిన తరువాతకూడ కొంతసేపటికి తకిలీని తిరుగునంత వేగముగా త్రిప్పవలెను. అందు వలన నూలు కంతటికి ఓకేసారిగ సమముగ పురి వచ్చును. అరచేతి

తో పురిపెట్టి వడకుట ప్రారంభించుటకు పూర్వమే చిటికెలతో పురిపెట్టుట బాగుగ తెలుసుకొనవలెను. వడకుటలో ఏకనుండి నూలు తెగకుండ జాగ్రత్త పడవలయును. వడికిన నపుడు తకిలీ మీదను చుట్టినపుడు తకిలీ కొనల్లో దగ్గర నుంచవలెను. నూలు తీయునపుడు క్రిందచేతి చిటికెలను ఏకు దగ్గరనుంచరాదు. తకిలీకొనకు కూడ మిక్కిలి దగ్గరగనుంచ రాదు. తకిలీకొనకు 5" లేక 6''లు పైన పట్టుకొనవలెను. వడకునపుడు తకిలీకి టిన్నగా నుండునట్లు నూలు పైకి తీయు వలెను. ఎడమచేయి పూర్తిగా పైకివచ్చిన తరువాత ఎడమ వైపునకు వంచి నూలుచుట్టవలెను. చుట్టునపుడు చేనూలు కనీసము 1 అడుగు వదల వలయును. ఈనూలు తక్కువగా నున్నచో క్రొత్తనూలును మొదలు పెట్టునపుడు దీనికి పురి యెక్కువై తెగిపోవును తకిలీని పురిపెట్టిన పిమ్మట తకిలీ కొనకు 5'' లేక 6'' పైగా కుడిచేతి చిటికెలతో నూలుపట్టు కొని ఏకునుండి నూలు తీయవలెను. పురిక్రిందనుండి పైకి వెళ్ళవలెను. గాన చిటికెలను గట్టిగ పట్టరాదు ఏకు పాడగుట వలన నూలు మధ్యమధ్య బుడగవలె వచ్చుచుచో పైచిటి కెలతో పైకిని క్రిందిచిటికెలతో క్రిందికిని లాగినచో నూలు సమానమగును. పూర్తిగా నూలుతీయుటకు పూర్వమే కుడి చేతిని తకిలీమీదుగా తీసికరావలెను. అందుచే నూలు దీయుట తత్క్షణము ప్రారంభించవచ్చును. కాలం వృధాయుండ రాదు. ఏకు ముగియగనే రెండవ యేకును తీసుకొనుటకు తకి లీని క్రింద నుంచనక్కరలేదు. కుడిచేతితో తకిలీని పట్టుకొని

సంబంధించిన అంశములందు కొంత కలయిక వ్యక్తమగు చున్నది. గ్రీసుదేశములో బాహ్యప్రపంచపు స్వభావాన్ని గుర్తించినారు. చైనాదేశములో బాహ్య ప్రపంచ తత్త్వానికి ఆంతరంగిక తత్త్వానికి ప్రాధాన్యత నివ్వక ఒక మానవునికి తోడిమానవులతో కల సంబంధాలకే ప్రాధాన్యత నిచ్చిరి. అట్లుగాక పాశ్చాత్య దేశములు సంపూర్ణముగా వాస్తవికతకు, అతి వాస్తవికతకు, భౌతిక తత్త్వమునకు ప్రాధాన్యత నిచ్చిరి. అందువలన అన్ని రంగములలో వారు ఎక్కువ అభ్యుదయమును పొందినామని గర్వించుచున్నారు.

వేదాంత సూఫీ తత్త్వాలు మానవునిలో సహజ గర్భితమైన ఆధ్యాత్మిక సత్య పదార్థానికి ప్రాధాన్యత యిచ్చి వాస్తవికతను భౌతిక పరిణామములను విస్మరించి సంఘములో గల బాధలకు, మిథ్యయని సాంఘిక దురాచారములను తొలగించుటకు శ్రద్ధవహించకపోయినవి. కావున ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాలలో నేది శ్రేష్ఠమో నిర్ణయించుట చాల కష్టము. శాస్త్ర విజ్ఞానము దుర్వినియోగము కాకుండా మానవ సమాజము అభివృద్ధి చెందుటకు సర్వోదయ స్థాపనకు విశ్వశాంతికి దోహదమిచ్చే యొక చక్కని జాతీయ విద్యాప్రణాళిక యవసరము. 1951-52లో ఢిల్లీలో జరిగిన "అంతర్జాతీయ విద్యావేత్తలగోష్ఠి"లో మౌలనా అజాద్ గారు, రాధాకృష్ణన్ గారు పై అభిప్రాయములను చెప్పించిరి. ప్రపంచవిద్యావేత్తలు తుదకు ఈ క్రింది అభిప్రాయమును తీర్మానించిరి. ఆధ్యా

త్మికతత్త్వానికిప్రాధాన్యతనిచ్చే పాశ్చాత్యసిద్ధాంతాన్ని అభ్యుదయానికి, వాస్తవికతకు, భౌతిక తత్త్వమునకు, ప్రాధాన్యతనిచ్చే పాశ్చాత్య సిద్ధాంతానికి సమన్వయము కుదిరినపుడు శాస్త్రవిజ్ఞానము దుర్వినియోగము కాకుండా మానవ సమాజాభివృద్ధి విశ్వశాంతికి యేర్పడగలదు. ఇదియే విద్యయొక్క పరమావధి. ఈ ప్రాక్పశ్చిమ సిద్ధాంతాల సమ్మేళన సాధించుట నేటి విద్యావేత్తల పరిశోధకులపై ఆధారపడియున్నది.

పై ఆశయమునే గాంధీగారు సర్వోదయమని నిర్వచించిరి. అట్టి సర్వోదయ స్థాపనయే విద్యయొక్క ప్రధాన లక్ష్యముగా నున్నది. ఇట్టి లక్ష్యసిద్ధి బేసిక్ విద్యద్వారా సాధించవచ్చునని చెప్పెను.

నాటి ప్రాథమిక విద్యావిధానము పల్లెల యవసరాలను పట్టణముల దేశముయొక్క అవసరములను ఎంతమాత్రము దృష్టిలో ఉంచుకొనలేదు. అదంతయు (Farce) బూటకము అని చెప్పవలెను. నూతన విద్య వలన పల్లెలకు పట్టణములకు మధ్య శాశ్వత సంబంధమేర్పడును. బాలురు, శారీరక, మానసిక, నైతిక యభివృద్ధి కలిగి స్వార్థములేని ఉత్తమ పౌరులుగా శిక్షణ బొందుదురు. భవిష్యత్తును గుర్తించి విశాలదృష్టి, ఉన్నత భావములు కలిగి దేశసౌభాగ్యముకొరకు తన బాధ్యతలు, హక్కులను గుర్తించి, తన భావిజీవితమును పాఠశాలలో నుండి విద్యార్థి గడపడము

ప్రారంభమగును. "Basic Education is inducation for life through life and through-out life" అని మహాత్ముడు వక్కాణించినాడు.

---

## దీనిని బేసిక్ విద్య అని ఏల పిలుతురు?

—:O:—

మార్జొరీసైక్సు తన గ్రంథమున 'బేస్' అనగా పునాది యనియూ, బాలుని భావిజీవితమునకు విద్య పునాదివంటిదని యూ, వివరించెను. ఒక సౌధమునకు పునాదు లెంతగట్టిగా నుండిన ఆ సౌధము అంత శాశ్వతముగాను, సుందరముగాను, ఉపయోగకరముగా నుండుననుట నిర్వివాదాంశము. నీటిపై గాని, ఇసుకనేలపై గాని పునాదులు నిలుచునా? అట్టి భవన నిర్మాణ మవివేకము కాదా? చక్కగా, నిర్దుష్టముగా, పటిష్ఠముగా, శాశ్వతముగా నుండునట్లు పునాదులు వేయవలెను. పునాదులు సరిగాలేని యెడల, బలముగా లేనియెడల ఎంతటి దివ్యసౌధమైనను, నేలగూలును గదా! దాని నిర్మాతలు, అందు నివసించువారు పరిసరముల నుండువారు ఎముకకూడ దొరుకక నశింతురు. కనుక పునాదులు శాస్త్రీయముగాను, గట్టివిగాను వేయవలెను. అటులనే సుస్థిర ప్రజాస్వామ్య స్థాపనకు భవి

స్వాతంత్ర్య భారత సౌభాగ్యమునకు మనము విద్యార్థులకు గఱపు విద్య పునాదివంటిది. మహాత్మగాంధి కలలుగన్న సర్వ మానవశ్రేయస్సే లక్ష్యముగాగల రామరాజ్యస్థాపనకు విద్యార్థులను తయారు చేయవలెను.

నూతన సాంఘిక వ్యవస్థలో ఆదర్శప్రాయమైన జీవితమును గడుపు సత్పౌరులుగ విద్యార్థులను రూపొందించుటకు నేడు మన మిచ్చువిద్య పునాదివంటిదిగా నుండును. భావి జీవితమును, స్వార్థరహిత స్వచ్ఛంద సర్వతంత్ర స్వతంత్ర స్వయంపోషక స్వావలంబన సహకార సంఘీభావ జీవితమును బాల్యదశనుండియే విద్యార్థులు అభ్యసించుచు అట్టిజీవితముద్వారా పై వివరించిన మహత్తర జీవితము కొఱకు తమ జీవితమంతయు గడుపుటకు బేసిక్ విద్య పునాదివంటిది. అందుకే ఈవిద్యను బేసిక్ విద్యయని నామకరణము చేసిరి. జీవితమునకు ఉపకరించు విద్య నిజముగా పునాది వంటిది. పరాశ్రయము, నిరుద్యోగము, పరపీడనము, మొదలగు అవినీతికర అధర్మజీవితమునకు దారితీయునటువంటిది విద్యకానేరదు. ధర్మబద్ధమైన- సత్యపదవీ ప్రమాణమైన- స్వార్థరహితమైన- స్వతంత్ర జీవితమే పవిత్రమైనది. అట్టిజీవితమును గడపుటకు బాలబాలికలకు శిక్షణ, బేసిక్ విద్యాప్రణాళికయందు నిబిడీకృతమైయున్నది. ఉన్నత భవన నిర్మాణమునకు పునాదు

లెంతముఖ్యమో, ఉత్కృష్ట జీవితమునకు విద్యకూడ అంత ముఖ్యము. మహాత్ముని బేసిక్ విద్యాప్రణాళిక పై లక్ష్య సిద్ధిని తప్పక పొందగలదని ప్రాచ్య పాశ్చాత్య విద్యావేత్తలుకూడ అభిప్రాయపడిరి.

## —: బేసిక్ విద్యయొక్క లక్ష్యములు, ఆశయములు :—

✓ విద్య మహాత్ము డాశించినట్లు నిర్బంధముగాను, ఉచితముగాను, సర్వజనీనమైనదిగాను, ఉండవలెను. బాలబాలికలు ఆరు (6) సంవత్సరములనుండి 14 సంవత్సరములలోపు వారికి ప్రభుత్వము 'తన విధ్యుక్త ధర్మముగా విద్యను గఱిపి పై లక్ష్యమును సాధించవలెను. భారత రాజ్యాంగచట్టరీత్యా ఆయారాష్ట్రాలలో అచటి బాలబాలికల మానసిక ప్రమాణమును బట్టి 1, 2 సంవత్సరముల భేదముతో పై వివరించిన లక్ష్యమును అమలు పరచవలెనని యున్నది. "ఎట్టి పక్షపాతము అభిమానములేక జాతి మత, వర్గ, వర్ణ, లింగవిభేదములు పాటించక మానవాభ్యుదయమే పరమలక్ష్యముగా మనసునందిడుకొని, ప్రభుత్వములు నా విద్యాప్రణాళికను అమలుపఱచెదరని విశ్వసించు చున్నాను" అని మహాత్ముడు చెప్పెను. ✓విద్యసర్వతోముఖమైనదిగా నుండవలెను. ఉపయోగకరమైన ఉత్పత్తిని సాధించు క్రియచేగాని, భౌతిక లేక ప్రకృతికి సంబంధించిన విషయములచేగాని సాంఘిక వాతావరణములోని, వస్తుసముదాయ కార్యకలా

పము చేగాని, బాలురకు నేర్పువిద్యను సమన్వయ పరచడమే యీ బేసిక్ విద్యా విధానములోని మూలసూత్రము. అనగా విద్యాబోధనలోని ప్రతి విషయమును పై తెలిపిన మూడు కేంద్రములతో సమన్వయ పరచవలెను.

కేం ద్ర ము లు

1) ఉపయోగకరమైన ఉత్పత్తిని సాధించు క్రియ.
   (Productive and useful activity)
2) భౌతిక లేక ప్రకృతి వాతావరణము
   (Physical or National environment)
3) సాంఘిక వాతావరణము
   (Social environment)

వీనినే (Centers of Correlation) సమన్వయ కేంద్రములు అని పిలుతురు. "Basic education is a technique of education correlated to some productive activity, Physical or social environments" (Harijan Sept. Dec' 46) సర్వమానవ సౌభ్రాతృత్వము, సమత్వము, జాతి, మత కుల, వర్ణ, వర్గ, లింగవిభేదముల కతీతమైన లౌకిక వర్గరాహిత్యము కలిగిన నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించుటయే యీ విద్యావిధానముయొక్క పరమావధి. In my ideal state, nobody shall call mine or thine' అన్నారు గాంధిగారు. అనగా " నీ, నా-అను భేదభావము నశించి, మన సహకార సంఘీభావముల కలిగి పరస్పర సాను

భూతిపరులై పరోపకారానురక్తులై వ్యక్తులు జీవించు సంఘము ఈ నా విద్యాప్రణాళికద్వారా సిద్ధించును'' అని మహాత్ముడు నుడివెను. అట్టి మహోదాత్తమైన మహోన్నత ఆశయములు, పవిత్రాదర్శములు నిత్యజీవితములో ప్రతిబింబించు యుత్కృష్ట జీవితమును బాలబాలిక లాపాదించుటయే బేసిక్ విద్యయొక్క యేకైక లక్ష్యము.

"It is to bring a new corporate, Co-operative, democratic social order''. అనగా సమగ్రమైన, సర్వతోముఖమైన సహకార సంఘీభావముగల ప్రజాస్వామ్య యుత నూతన సాంఘిక వ్యవస్థను నిర్మించుటయే బేసిక్ విద్య యొక్క ముఖ్యాశయము.

"Democracy in the sense that every citizen understands his rights and duties". (Harijan July 20. 1947) అనగా పౌరులు తమ హక్కులతో బాటు విధులను బాధ్యతలను గుర్తించి ప్రవర్తించుటయే ప్రజాస్వామ్య లక్షణము.

దీనిని బేసిక్ విద్య, పునాది విద్యయనుటకు మూడు ముఖ్య కారణములుగలవు. 1) బాలుడు ప్రాథమిక దశయం దభ్యసించు విద్య వాని జీవితమునకు పునాదిగా నుండవలెను. దీనిని ''బేస్'' ఆధారముగా తీసికొని భావి విద్యావిధానము సాగవలెను. జీవితమునకు అతి ప్రాముఖ్యము వహించునట్టి విద్యగనుక దీనిని బేసిక్ విద్య యందురు. 'బేసిక్'

అనగా పునాది యనియు అతిముఖ్యమైనదనియు అర్థము కలదు. ii) ఎట్టివిద్య మున్ముందు బాలుని ఉన్నత విద్యా సౌధములకు జీవితమునకు ఆధారముగా, ముఖ్యముగా, పునాదిగా నుండునో, అట్టి విద్యనే బేసిక్ విద్య యని యందురు.

"It is the foundation on which the super structures of high schools and College education is built" (Mahatma's report to the Nai Thalim Sangh.) iii) జీవితములోని అనేక క్లిష్ట సంశ్లిష్ట విషయములను ధైర్య స్థైర్యములతో నెదుర్కొనుటకు వలయు ఆధ్యాత్మిక నైతికబలమును బేసిక్ విద్య సమకూర్చును. పవిత్ర ఆశయములగు సత్యము, అహింస, ధర్మము, దయ, సహకారములతో కూడిన యుత్కృష్ట జీవితమును ఏవిద్య యివ్వగలుగునో అట్టి దానిని బేసిక్ (Fundemental) అనగా అతిముఖ్యమైనదని అత్యవసరమైనదని, సర్వోత్కృష్టమైనదని చెప్పక తప్పదు. కావున బేసిక్ విద్య పై లక్ష్యములను ఆశయములను సాధించు ననుటలో అతిశయోక్తి యేమాత్రము లేదు.

ఈ విద్యా విధానములో "Learning by doing" కృతి యుక్తాభ్యసనము అతి ముఖ్యమైన మూలసూత్రము. గొప్ప గొప్ప విద్యా వేత్తలు పై విద్యా సూత్రమును వివరించిరి. అట్టి కృతి యుక్తాభ్యసనము మనస్తత్వ శాస్త్ర సూత్రప్రాయముగా ఉండును. బాల బాలికలకు దాని

వలన శాశ్వత స్మృతి యేర్పడును. ఈ విషయము అతిపురాతనమైనదే. ఇందులో మహాత్ముని నూతన సృష్టి యేమియు లేదు. అయితే విద్యా ప్రపంచములో మహాత్ముడు తెచ్చిన మహత్తర విప్లవము, నూతన పరిణామము ఏమిటి? ఈతని విద్యా ప్రణాళికలోని ప్రత్యేకత విశిష్టత ఉపజ్ఞత యేమి? అని కొందఱు ప్రశ్నించవచ్చును.

"Old wine in new bottles". అనగా ప్రాత పానీయమును క్రొత్త పాత్రిలో నందించుటయని కొంతమంది విమర్శకులవాదన. స్థూలముగా పైపైన మహాత్ముని విద్యా ప్రణాళికను చదివి అట్టి తొందఱ అభిప్రాయములకు విమర్శనకు దిగరాదు. సూక్ష్మముగా ప్రణాళికను చదివి, విషయములను గ్రహించిన యెడల మహాత్ముని ప్రణాళిక యెందులకు సర్వోత్కృష్టమైనదో సుబోధకముకాగలదు.

విద్యాజ్జగత్తులో మహాత్ముడు ఒక మహత్తర విప్లవమునే సాధింప ప్రయత్నించినాడు. పూర్వపు విద్యా సూత్రము "Learning by doing" కృతి యుక్తాభ్యాసనమునకు మహాత్ముడు మరొక విశేషణము Earning' ప్రియోజనకారి చేర్చి, పై విద్యా సూత్రము నీ విధముగా పూర్తి జేసెను. "Learning by doing and earning at the same time.

కృతి యుక్తాభ్యాసనము క్రీడా మార్గమను విద్యా సూత్రములు బేసిక్ విద్యా ప్రణాళికయందు పునాదులుగ

పై నిర్వచనములో ఈ సంపాదన పదము తీసివేసిన నేమగును? ఏదో క్రియ చేయడము తద్వారా విద్య నేర్వడము మిగిలి పోవును. దీనికి దరి ద్రాపు కనపడదు. అప్పుడు అదొక అయోమయ సిద్ధాంతముగా బయలు దేఱును. కాన, విద్యా గ్రహణమునకు, ఒక నిర్ణీత నిర్దిష్ట లక్ష్య ముండితీరవలెను. సంపాదన పదము చేర్చుటవలన ఎక్కువ ముడిపదార్థముల దుర్వినియోగము కాకుండా, ఉపాధ్యాయులు, విద్యార్థులు, అన్యథా తమ మానసిక శక్తులను వ్యర్థపుచ్చక కేవలము క్రియ పైననే తమ దృష్టిని కేంద్రీకరించి వారి నైపుణ్యమును చూపుదురు. అట్టి తఱి ద్రవ్య నష్టమునకు తావులేదు. కృతి యుక్తాభ్యసన విద్యా గ్రహణ సూత్రములో క్రియ ద్వారా విద్య నేర్చుకొనుట జరుగును. అయిన, క్రియను ఎట్లో చేయవలెను? ఏదో క్రియ చేయడము, కొంత విద్య నేర్చుకొనడము, జరుగును. స్పష్టత శూన్యమగును. నేర్చిన విద్య యెట్టిది? మున్ముందు తన భావిజీవితమునకు ఉపయోగ పడుటకు పునాదివంటిదిగా నుండవలెను. మహాత్మా గాంధీ గారు నిర్వచించిన ప్రకారము విద్యార్థి భా వి జీ వి త ము సర్వతంత్ర స్వతంత్ర స్వయంపోషక, స్వావలంబన జీవితముగా, సమగ్ర సర్వతోముఖాభివృద్ధిం జెంది, సంపూర్ణ మానవత్వ ముతో వికసించునట్టిదిగా నుండవలెను. కాన, స్వయంపోషక జీవితమునకు బాల్యమునుండియే పునాదులువేయవలెను. అట్టి స్వయంపోషక, స్వావలంబన పునాది విద్యయే ‘బేసిక్’ విద్య. ఈ స్వయంపోషక సూత్రమును సాధించుటకై కొంచెము కొం

చెయుగ, క్రమ క్రమముగ ప్రాథమిక తరగతులనుండి పాఠశాలలు స్వయంపోషకములై యుండవలయునని "బేసిక్" విద్య లక్ష్యము. స్వయంపోషక సూత్రము ననుసరించి ప్రతిక్రియను మనము విమర్శించిన యెడల పై నిర్వచించినట్లు 'సంపాదన' శబ్దము విద్యాసూత్రములో తప్పని సరిగా చేర్చవలసివచ్చును. ఏదో కొంత సంపాదన సాధించవలెనను లక్ష్యసిద్ధితో క్రియను చేసిన అట్టి క్రియ నైపుణ్యముగ జరుగును. మనము ఉత్పత్తి జేయువస్తువు సంఘములోని వారి నిత్యావసరముల కుపయోగపడునట్టిదిగా నుండవలెను. అపుడే వస్తువునకు విలువ-మంచి చలామణి కలుగును. కాన, ఉత్పత్తి యొక్కువ ముడిసరకు లేక, అనవసరకాలయాపన జరుగకుండా, పెట్టుబడి నష్టము గాకుండా, శీఘ్రముగా, నైపుణ్యముగా, ఉపయోగకారిగ తయారు కావలెను. అపుడే సంపాదన సిద్ధించును. కాన, యొక్కువ శ్రద్ధతోను, శాస్త్రోక్తముగాను, అత్యంత ఆసక్తితోను, క్రియ జరుగును. లేనియెడల ఉత్పత్తి వ్యర్థమగును. తద్వారా విద్య నేర్పడము సాధ్యపడదు. "When he does a thing scientifically, there is much scope for learning in it." (Mahatma's report to the Hindustani Talim sangh.) విద్యార్థి యెప్పుడు క్రియను శాస్త్రోక్తముగా నిస్పృహముగా చేయునో అప్పుడే విద్య నేర్చుకొను అవకాశములు ఎక్కువగ లభించును.

"Hence, I lay emphasis on doing – How? and why?." If doing is perfectly scientifically

performed, then learning is easy, and earning will automatically follow. If you lay emphasi son earning and neglect learning then nothing comes out. So, learning and earning must be weighed very carefully. If you lay emphasis on earning it becomes a work like the craftsman just to earn his daily bread. So, I plead learning' is more important than earning. కనుక మనముచేయు క్రియ, నిర్దుష్టముగాను, శాస్త్రోక్తముగాను, నైపుణ్యముగానుండిన తద్వారా విద్యాభ్యాసము సంపాదన తప్పక లభించును. సంపాదనకై ప్రయత్నించిన విద్యాభ్యాసము జరుగదు.

When it becomes a blind craft "M. K. G" కాని సంపాదిత ఉత్పత్తి సాధక కృతియుక్తాభ్యాసనము చేసి విద్యా సూత్రమని చెప్పవచ్చును.

ఇట్లు ఈ సంపాదన (Earning) అను పదముచేర్చి మహాత్ముడు విద్వజ్జగత్తులో నొక మహత్తర విప్లవము తెచ్చినాడు. ఒక పాఠశాల మొత్తముగా అన్ని గ్రేడులు కలసి కొంతవరకు స్వయంపోషకత్వము పొందినది అని చూడవలెను. అట్లుగాక గ్రేడువారిగ స్వయంపోషకత్వ కాలమును చూచుట మంచిదికాదు. ఏలన, చిన్న తరగతి బాలురు ఎక్కువ స్వయంపోషకత్వమును సాధించలేరు. క్రమేణ, విద్యార్థులు అభివృద్ధియగు కొలది, స్వయంపోషకత్వమునందు సిద్ధులగు

దురు. చిన్న చిన్న బాలురు మడులను తయారుచేసి విత్త నములు చల్లి నీరుపోసి, పాఠశాల వసతి గృహమున కవసర ముగు కూరగాయలను, ఆకు గూరలను, పూలమొక్కలను పెంచవచ్చును. పైతరగతి బాలురు కొంచెము యెక్కువ పరిశ్రమతో కూడిన పనులను సాధించవచ్చును. ఇట్లు పాఠ శాల ముఖ్యముగా స్వయంపోషక శాతమును చూడవలెను.

పూర్వపు విద్యావేత్తలు చెప్పిన కృతియుక్తాభ్యసన విద్యా మూలసూత్రమును మహాత్ముడు విస్తృత పఱచి అట్టి క్రియ యెట్లుండవలెనో వివరించెను. క్రియ విద్యాభ్యసనము నకు ఉత్పత్తిని సాధించుటకు స్వయంపోషకత్వమునకు దోహద మిచ్చునట్లుగా నుండవలెను అని యుద్ఘాటించెను. ఇట్టి క్రొత్త మార్పు అట్టి శాస్త్రీయముగను మానసిక శాస్త్ర సూత్రరీత్యా సత్యమైనదిగను ఆర్థిక శాస్త్రదృష్ట్యా మంచి లాభకారియైనదిగను, విద్యావిషయములో గొప్పదిగ నున్నది. "It is scientifically true, Psychologically perfect, economically sound and padagogically ideal." ("Seven years plan")

అనాదినుండియు మానవుడు తన విజ్ఞానమును సమస్త మును కృతియుక్తాభ్యసనము ద్వారానే సంపాదించెను. రాతి యుగము వారు, వేట, కొయ్యపని, ఈత మొదలగు కృత్య ములు జ్ఞానమును అనుభవ పూర్వకముగా నేర్చిరి. ఆరోగ్య మును గుఱించి చెప్పుట సులభము. కాని, ఆరోగ్యముగా

నుండుట కష్టము. మాటలతో గాక క్రియాపూర్వకముగానే దేనినైనను నేర్పవలయును.

Instead of teaching much, if we make them live - like ......... then it will be a real learning. "Harijan Sept '46.'

అందుకొఱకు గాంధీగారు బేసిక్ విద్యను 'జీవితము ద్వారా, జీవితముకొఱకు జీవితమంతయు నేర్చుకొను విద్య' యని నిర్వచించినారు. విశ్వ విద్యాలయములలో పాక శాస్త్రములందు వ్యాపార వ్యవహారములందు, ఆర్థిక విషయము లందు, గొప్ప నిష్ణాతులై పట్టముపొందినవారు జీవితములో నీటినుండి బయటపడిన చేపలవలె అల్లాడుచున్నారు. 'D.S.C. Ag' అనగా వ్యవసాయమునందు విద్యాకోవిద బిరుదము సంపాదించిన పట్టభద్రులు సెంటు భూమిని స్వయముగా సేద్యము చేయలేని విషయము మనకందఱకు తెలిసినదే. వారు నేర్చిన పదజాలము సిద్ధాంతము కేవలము ఆంగ్లమున యున్నది. వేరుశనగకాయ, చింతకాయలవలె చెట్లకుగాయునని నొక్కి-వక్కాణించెడి వెఱ్ఱిమొగము లెందఱులేరు. అనగా గ్రంథస్థ మైన చదువు-అనుభవవేద్యముగాని చదువు-వ్యర్థము. తర్క-శాస్త్ర దృష్ట్యాకాక, జీవిత దృష్ట్యా మానసిక శాస్త్రసమ్మతముగా విద్య నేర్పవలెను. భావిజీవితమునకు వలయు విద్యను అనగా మహాత్ముడు నిర్వచించినట్లు "సర్వతంత్ర స్వతంత్ర స్వయంపోషక స్వావలంబన జీవితమునకు తయారు చేయు

నట్టిదిగా నుండవలెను. పిల్లల వయోబుద్ధి వికాసములను, మానసిక తత్త్వములను ఉపాధ్యాయుడు గమనించి, బాలుర అభిలాష, అనురక్తి గుర్తించి, విద్యాబోధన జరుపవలెను. వారి సహజమైన నిత్యజీవితముతో కూడిన విషయములను, వారికి శ్రద్ధను, అనురక్తిని కల్గించు విషయములను బేసిక్ విద్యాప్రణాళికయందు సమన్వయించినారు. కాన ప్రారంభ విద్యను సహజమైనదిగను, ప్రకృతి సిద్ధమైనదిగను, వాస్తవిక స్థూలవిషయముల ద్వారాను గఱపుట చాలమంచిది. ఇట్లు బేసిక్ విద్యాప్రణాళికయందు బాలుర శారీరక మానసిక ఆధ్యాత్మిక లేక నైతికశక్తులు, పెంపొంది, వారు సమగ్ర సర్వతోముఖాభివృద్ధిగాంతురు. క్రియచేయుటలో విద్యార్థులు శారీరకాభివృద్ధిని మానసికాభివృద్ధిని సాధించుచున్నారు. కలసి, మెలసి, జీవితముద్వారా విద్య నేర్చుకొనుటవలన చక్కని సాంఘికశిక్షణ, సహకార సంఘీభావము, సంఘము మీద తనకుగల హక్కులు బాధ్యతలు గుర్తించుటవలన బాలురు నైతికముగా శక్తివంతులగుచున్నారు. మేధాశక్తిని పెంపొందించుటే విద్యా విధానానికి ప్రధాన ప్రాతిపదిక యయినప్పటికి, చక్కని నడవడి, సాంఘిక బాధ్యతలను గుర్తించుట కాయకష్టానికిగల విలువను తెలిసికొనుట యను నవికూడ చాలముఖ్యమైనవి. వీనిని విద్యార్థులకు సంపూర్ణముగా సమకూర్చుటయే బేసిక్ విద్యా ప్రణాళికయొక్క ఆశయము. దేశములో నానాటికి పెరుగుచున్న నిరుద్యోగ సమస్యా పరిష్కారము బేసిక్ విద్యద్వారా సాధ్యమగుచున్నది.

ఇట్టి విద్యాపద్ధతిలో రూపొందిన యువతీ యువకులు, ఉద్యోగములకై పాకులాడు పరాశ్రయ జీవితమునకు స్వస్తి చెప్పి సర్వతంత్ర స్వతంత్ర స్వయం పోషక పరోపకార పవిత్ర జీవితమును తాను నేర్చుకొనిన వృత్తి ద్వారా గడపగలరు. బేసిక్ విద్యను 'వృత్తి కేంద్ర విద్య' అనికూడ పిలుతురు. (Craft-centered education') ఇదివరలో చెప్పబడినట్లు "క్రియా" అను పదమునకు "వృత్తి" అను పదము చేర్చి చదివిన ప్రారంభదశనుండి బాల బాలికలను ఏదేని ఒక వృత్తియందు ప్రవేశింపజేసి ఆవృత్తిని కేంద్రముగా తీసికొని అట్టి వృత్తికి సంబంధించిన యావద్విషయములను గ్రేడువారిగ, ఏకకేంద్ర పద్ధతిని అభివృద్ధి పఱచవచ్చును. కొద్ది సంవత్సరములలో బాల బాలికలు యువతీయువకులై జ్ఞానమును సంపాదించి యేదేనియొక్క వృత్తియందు సిద్ధహస్తులగుదురు. మన్య పరగణాలలో, వార్ధాలో చేసిన ప్రయోగముల పరిణామముగ నేడు వేలు విద్యార్థులు విద్యార్థినులు, తాము నేర్చిన వృత్తుల ద్వారా స్వతంత్ర జీవితమును గడుపుకొనుచున్నారు.

---

## బేసిక్ విద్య — విద్యా కేంద్రములు.

:O:

బేసిక్ విద్య ప్రధానముగా మూడు కేంద్రముల సహాయమున నేర్పబడును.

1) భౌతిక లేక ప్రకృతి వాతావరణము.

2) సాంఘిక వాతావరణము.

3) వృత్తులు, పరిశ్రమలు.

బాలురకు నేర్పించవలసిన విషయములన్నియు కేవలము వృత్తి కేంద్రములుగ నేర్పలేము. వార్ధాలో మహాత్ముడు తీర్మానించినట్లు ప్రతివిషయము ను వృత్తి కేంద్రముగానే నేర్పవలెనను సూత్రమును మరికొందరు విద్యావేత్తలు సవరించి, సడలించి, భౌతిక వాతావరణము, సాంఘిక వాతావరణము ద్వారా కూడ చెప్పవచ్చునని తీర్మానించిరి.

1) భౌతిక లేక ప్రకృతి వాతావరణము.

బాలురు సహజముగా చూచు ఆడుకొను అనుభవించు ప్రకృతి వాతావరణము, గాలి, ఎండ, వాన, కొండలు, నదులు, కాలువలు, వృక్షములు, జంతుజాలము ఆకాశము, సూర్య చంద్రులు, నక్షత్రములు, మెఱుపు తీగెలు, పగలు రాత్రి మొ॥వి కొన్ని యితర ప్రకృతి విషయముల నాధారముగ తీసికొని, వానిని కేంద్రముగా తీసికొని, నేర్పవలసిన విద్యావిషయములు అనగా తెనుగు, గణితము, శాస్త్రము, సంగీతము, చిత్రలేఖనము, మొదలగునవి సమన్వయపఱచవలెను. ప్రారంభ దశలో కేవలము విద్య వృత్తి కేంద్రముగా నేర్పవలెనన్న కష్టతరముగానుండును. కనుక ఈ భౌతిక సాంఘిక వాతా

వరణములను కేంద్రములుగా తీసికొని, విద్యావిషయములను సమన్వయపఱచవలెను.

## (2) సాంఘిక వాతావరణము

ఇందు, ఇల్లు, పరిసరములు, తలిదండ్రులు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు, స్నేహితులు, పిన్నపెద్దలు, గ్రామములోనుండు వివిధ వృత్తులు, వ్యాపార వ్యవహారములు, సాంఘిక ఆచారములు, ఆటలు పాటలు, ఉత్సవములు, ఊరేగింపులు, పండుగలు, వేడుకలు, వినోదములు, ఆనందములు, వింతలు, విశేషములు మొదలగు అనేక కార్యకలాపముల ద్వారా వానిని కేంద్రముగా తీసికొని, బోధించవలసిన విద్యా విషయములు, తెనుగు, గణితము, శాస్త్రము మొదలగు వానిని, సమన్వయపఱచవలెను.

## (3) పరిశ్రమలు-వృత్తులు

గ్రామములోని వివిధ పరిశ్రమలను వృత్తులను, బాలురకు పరిచయము చేయవలెను. ప్రతి పాఠశాలయందు నిత్యావసరములదీర్చు ముఖ్యవృత్తులను ప్రవేశపెట్టి గ్రేడువారిగ ఏకకేంద్ర పద్ధతిని వృత్తులకేంద్రముగా తీసికొని విద్యావిషయములను బోధించవలెను. ఇట్లు వృత్తులనే కేంద్రముగా తీసికొని, విద్యావిషయముల నెంతేని చెప్పవచ్చును. క్రమక్రమముగా బాలు డభివృద్ధిచెంది వృత్తియందు నైపుణ్యా

విద్య సహజముగావచ్చును. కావున వారియందుండు సహజాతమును విద్యాభ్యాసనమున కుపయోగపఱచవలెను. వారియొక్క క్రీడానిర్మాణాత్మక సహజాతములను ఉపాధ్యాయుడు చక్కగా వినియోగించుకొనవలెను. విద్యార్థులు సహజముగా తాము చేయు క్రియలయందు ఎక్కువ ఉత్సాహమును కలిగి నిమగ్నులై పోదురు. అట్టిసమయమున నెంతటి కఠినమైన బోధనా విషయమునుకూడా వారు చక్కగా గ్రహింపగలరు. కౌతుక సహజాతమును క్రియాకేంద్రముద్వారా విద్యాభ్యాసమున కుపయోగించుకొనవలెను. క్రియ బాలుర నిర్మాణ కౌతుకములను ప్రేరేపించునట్టిదిగ నుండవలెను. బేసిక్ విద్యావిధానములో మన మెట్టి క్రియలను ఎన్నుకొనవలెను? మానవ జీవితమునకు నిత్యావసరములైన తిండి, ఇల్లు, బట్ట-వీనిని తనంతటతానే సంపాదించుకొనుటకు దోహదమిచ్చు క్రియలను లేక తత్సంబంధమైన ఉపక్రియలను ఉపాధ్యాయుడు క్రియా కేంద్రములుగా నెన్నుకొనవలెను. బేసిక్ విద్యావిధానమునందు లీనమైయుండు కృతియుక్తాభ్యాసనము క్రీడామార్గ సూత్రాచరణమను విద్యాసూత్రములను మాంటిసోరీ ప్రణాళికయందుకూడ ముఖ్యముగా కనబడుచున్నవి. అయిన మహాత్ముడు ప్రవేశపెట్టిన నవీనవిద్య ఆధిక్యతయేమి? దాని విశిష్టత ప్రత్యేకతలేమి? ఈ నవీన విద్య కృతియుక్తాభ్యాసనమేకాక, పాఠశాలకు కొంత ఆదాయము తెచ్చునదిగానున్నది. జ్ఞానార్జనతో కూడిన భావిజీవితమున స్వతంత్రుడుగా నుండునట్టి యొకవృత్తిని బాల్యమునుండియే మానవుడు నేర్చుకొను

చు న్నాడు. విజ్ఞానముతో బాటు స్వయంపోషకత్వమును, స్వావలంబనమును, బొందుచున్నాడు. ఈ స్వయంపోషక, స్వావలంబన, స్వచ్ఛంద సర్వతంత్ర స్వతంత్ర జీవితముచు గడపుచున్నట్టి ఉత్తమ మానవునిగా రూపొందించుటయే బేసిక్ విద్యయొక్క- విశిష్టత, ప్రత్యేకత- ఆధిక్యత. నిరుద్యోగము, భానిసత్వము, పరపీడనము, దౌర్జన్యము స్వార్థపరత్వము మొదలగు పిశాచగుణములను రూపుమాపి, పరోపకార సహకార సంఘీభావ స్వార్థత్యాగాది మహోత్కృష్ట గుణములను విద్యార్థులకు నేర్పుటయే బేసిక్ విద్యయొక్క- పరమావధి. ఇదియే విద్యా ప్రపంచములో మహాత్ముడు తెచ్చిన మహత్తర విప్లవము.

ఈ నవీన విద్యా విధానమునకును, యెత్తుగడ పద్ధతికిని (Project method) ఎక్కువ సామ్యము కన్పడుచున్నది. పాఠశాలలో విద్యా బోధనకు ఏదో ఒక ఉద్యమమును లేదా యెత్తుగడ నెన్నుకొందుము. నవీన విద్యా విధానములో నేదోయొక యెత్తుగడ నెన్నుకొనక మానవుని జీవితావసరములగు అన్నము, వస్త్రము, గృహము, మొదలగువానికి సంబంధించిన యెత్తుగడలనే యెన్నుకొందుము. కాన ఒక నిర్ణీతమైన నిర్దుష్టమైన ప్రయోజనకారులగు ఎత్తుగడలనే యెన్నుకొందుము.

"The project that we select must be of such a thing that it satisfies the basic need of the huma-

nity: Food, cloth and shelter" M. K. G. ఎన్నుగడ పద్ధతిలో ఎక్కువ కాలయాపన ద్రవ్యనష్టము ముడి సరకుల నష్టపోవుట తక్కువ ప[illegible]నార్జన జరుగును. అట్లుగాక నవీన విద్యా ప్రణాళికలో కొంత ఆదాయమును సమకూర్చునట్టిది యున్న, భావి జీవితమున స్వతంత్ర జీవితము గడుపుటకు ఉపయోగపడు వృత్తులను ఎత్తుగడలుగా నెన్ను కొందుము. విద్యార్థులు చక్కని మానసిక శారీరక నైతిక శిక్షణ పొంది ఉత్తమ పౌరులుగ తయారగుదురు. రాజకీయముగ, ప్రజా స్వామ్యముగ, ఆర్థికముగ వికేంద్రీకృతమై ఆర్థిక సమత్వము ప్రతిపత్తి కల్గిన సాంఘికముగ జాతి మత, వర్ణ, వర్గ విభేదములేని నూతన సాంఘిక వ్యవస్థకు నవీన విద్య పునాదులు వేయును.

ఇట్లు శాస్త్ర సమ్మతమైనదని, విద్యా మానసిక శాస్త్ర సూత్రప్రాయమని, ఆర్థిక శాస్త్ర దృష్ట్యా ఆదాయమిచ్చునది యని, విద్యా విషయములో గొప్పదని, బేసిక్ విద్యను ప్రాచ్య పాశ్చాత్య విద్యావేత్తలు కొనియాడిరి.



# బేసిక్ విద్య — నూతన సాంఘిక వ్యవస్థ

—:O:—

స్వార్థపరత్వము, పరపీడనము, దౌర్జన్యము, పరాశ్రయము మున్నగు దుష్టశక్తులను రూపుమాపి, స్వార్థ రాహిత్యము, పరసహనము, త్యాగము, సేవ, సహకార సంఘీభావములు, సర్వమానవ సౌభ్రాతృత్వము జాతిగౌరవ ప్రతిష్ఠలను అభ్యుదయపరచే వ్యక్తిత్వము మానవ కల్యాణమును కాంక్షించెడి పౌరసత్వము మొదలగు మహోత్కృష్ట ఆదర్శములతో జీవితముగడపెడి సర్వతంత్ర స్వతంత్రులై నీతివంతముగ ధర్మబద్ధమైన అనగా సత్యాహింస ధర్మములను నిత్య జీవితమున ఆచరించు ఉత్తమ పౌరులుగల నూతన సాంఘిక వ్యవస్థా నిర్మాణమే యీవిద్యయొక్క పరమావధి.

బేసిక్ శిక్షణ పొందిన విద్యార్థులు భావి జీవితములో జాతి మత వర్ణ వర్గ లింగ విభేదములను విస్మరించి “వసుధైకం ఏక కుటుంబానాం” అను సూత్రముపై నడచుకొందురు. వర్గవైషమ్యములు, మతవిద్వేషములు, మొదలగు మారణ పిశాచములకు తావులేదు. నీది, నాది, అను భేద భావము లేక ‘మనది’ అను విశ్వసౌభ్రాతృత్వము కలిగియుందురు.

A Society in which nobody shall call mine or thine ..................All for one and one for all.

నిరుద్యోగ సమస్య, పరతంత్ర జీవనము, జాతి దేశగౌరవ ములను నశింపజేయు వ్యక్తిత్వము, పూర్వపు విద్యావిధాన పర్యవసానములు. విశ్వవిద్యాలయములలో పట్టభద్రులు శుష్కశరీరులై మానసిక దుర్బలులై, నైతిక పతనము సంఘమునకు, దేశమునకు, ఎట్టిసేవ చేయలేక, తమను తామే పోషించుకొనుటకు, బాధపడుచుందురు. సర్వజనుల స్వతంత్రత, స్వయంపోషకత్వము, స్వావలంబనము, జీవితమున అతిముఖ్యములు. ఇట్టిదియే నిష్కళంకమైన పవిత్ర జీవనము. "Service to humanity" — సోదర మానవ సేవయే నవీన విద్యకు పరాకాష్ఠ. ప్రతిమానవుడు సుఖమునే ఆశించును. ఎప్పటికిని తనకు, ఎవరో నిరంతరము సేవ చేయవలయుననియే అపేక్షించును. కాని, ఒక్క క్షణమైనను, తాను ఇతరులకు సేవచేయవలెనను విద్యుక్త ధర్మమును గుర్తింపడు. 'సంఘములో సాంఘికముగాను, ఆర్థికముగాను వెనుకబడిన సోదరమానవులు ఎన్నాళ్ళు మనలను సేవింపగలరు? వారి ఆర్థిక సాంఘిక దుస్థితిని బాగుపరచుట మన కర్తవ్యమైయున్నది. ఇట్టి సోదరమానవుల పతనాన్ని శాశ్వతముగాచూచుచు మన దారిని మనము పోవుట మానవత్వమేనా? కనుక వారిని ఉద్ధరించవలయునన్న తలంపుతో మనము వారిని సేవించవలెను. ఎట్టి నీచమైన పనియైనను సరే దానిని గౌరవించవలెను. సరియైన సమాన అవకాశములను కల్పించిన ఇట్టి వర్గభేదము నశించిపోవును. అందఱు ఒకే సమాన స్థాయిన ఒకరుతక్కువ ఒకరు ఎక్కువ అనుభేదము

లేక సుఖముగా జీవించవలెనన్న ప్రతియొకరు, స్వయంపోషక స్వావలంబన సూత్రములను సర్వతంత్ర స్వతంత్రతను గట్టిగా ఆచరించవలెను. అట్టి నూతన సాంఘిక వ్యవస్థా నిర్మాణ మునకు అవిరళకృషి విద్యోద్యోగముతో జరుగవలెను. నేటి బాలబాలికలు రేపటి సంఘపౌరులుగ తయారగుదురు. బాల బాలికలను పై నిర్వచించిన సంఘమునకు పౌరులుగ తీర్చి దిద్దు శిల్పవిద్యయే నవీనవిద్య.

నేడు అమెరికా, రష్యా, చైనా మొదలగు పాశ్చా త్యాభ్యుదయదేశములలో అమలులోనున్న పారిశ్రామిక విద్య (Industrial education, America) వృత్తికేంద్ర విద్య (Vocational training, Russia) (Politechnical education, China) – సర్వసాంకేతిక విద్య – మొదలగు విద్యావిధానములతో పోల్చిచూడవలెను. అనగా వానికన్న మనము వెనుకనున్నామా? లేక ముందున్నామా? వాటికన్న మన విద్యాప్రణాళిక యెట్టి అభ్యుదయమును సాధించగలదు? అనగా సర్వతంత్ర స్వతంత్రులైన పౌరు లను ఏదోయొక వృత్తి అభ్యసింపజేసి తన జీవితమును ఏదోవిధముగా గడపుకొనునట్లు చేయును. ఇందులో సర్వ తంత్ర స్వతంత్రత, స్వావలంబన లోపించినవి. కాని నిరు ద్యోగము పరాశ్రయము లేక ప్రతివ్యక్తియు స్వతంత్రత పొందుచున్నాడు. ఇట్టి సంఘములలో వ్యక్తులు స్వార్థపరులై హాహాకారి పోరాటముచేసి పోటీలువేసికొని యొకరిని

మించి మరియొకరు ఒకరి నొకరు మోసము చేసికొనుచు, కేవలము ద్రవ్యార్జన, వ్యక్తిసుఖము, జీవిత లక్ష్యములుగా తలంచియున్నారు. ఇదియే అతివాస్తవిక భౌతిక తత్త్వము. శాస్త్రజ్ఞానమును, సర్వమానవ శ్రేయస్సునకై ఉపయోగింపక, ఒక దేశమువారు మఱియొక దేశమును దాస్యమునుగా అణచి మించుకొన ప్రయత్నము చేయుచున్నారు. అట్టి సామ్రాజ్య ఆక్రమణమునకు శాస్త్రజ్ఞానము "Atom bomb" "Hydrogen bomb" "Cobalt bomb" మొదలగు మారణయంత్రములను కనిపెట్టి ప్రపంచనాశనమునకే దారితీసినది. శాస్త్రజ్ఞానమును, సర్వమానవ శ్రేయస్సునకై ఉపయోగపడి మనట్లు వలయు మానసిక నైతిక శక్తి మానవులయందు పెంపొందించడమే బేసిక్ విద్యయొక్క లక్ష్యమైయున్నది. ఏదోవిధముగ, అనగా, పరపీడన, దేశద్రోహము, వంటి జీవితమును గడపుకొనుట విద్యకాదు. స్వతంత్రజీవితము గడపుటయే పాశ్చాత్య విద్యాలక్షణము. సర్వతంత్ర స్వతంత్ర జీవనముతోబాటు నైతిక ఆధ్యాత్మిక ధర్మజీవనము గడపుట ప్రాచ్య విద్యాలక్షణము. సర్వోదయమే బేసిక్ విద్య యొక్క లక్ష్యము. విద్యార్థికి వలయు వృత్తివిద్య నొసంగును. ఒక నిర్ణీత నిర్దుష్ట అభ్యుదయజీవితమును, ప్రారంభమునుండి విద్యార్థి నవీనవిద్యలో ఆచరించును. ముందుగా ఎట్టి పవిత్రమైన జీవితము గడపవలెనో అట్టి జీవితముద్వారా, అట్టి జీవితముకొఱకు జీవితమంతయు విద్యార్థి విద్యనేర్చును. "Basic education is education for life through

life, and through- out life" విద్యఅనుదానికి ఆది అంత ములు లేవు. Education begins from the cradle and ends with the grave. "M.K.G." పాశ్చాత్య దేశములలో విద్యకు ఇట్టిప్రమాణము లేమియు లేవు. "Basic education gives not only Knowledge about Craft but something about his life he has to live in future. వ్యక్తులు సహకార సంఘీభావము కలిగి సర్వతంత్ర స్వతంత్రు లుగా బేసిక్ విద్యద్వారా శిక్షణబొందుదురు. ప్రజాస్వామ్య అభిలాష, సేవాతత్పరత, మొదలగు మహోన్నత ఆదర్శ ములును ఈ విద్యద్వారా సిద్ధించును. కనుక ఈనైతిక ఆధ్యాత్మిక దృష్టి మన విద్యావిధానములోని విశేషము. కాన, అభ్యుదయ పాశ్చాత్య దేశాల విద్యాప్రణాళికలకన్న బేసిక విద్యా ప్రణాళిక ఎక్కువ మానవాభ్యుదయమును సాధించు నని నొక్కి వక్కాణింపనగును. "చట్టబద్ధమైన, ధర్మబద్ధమైన, సత్యపరసత్వ ప్రజాస్వామ్య జీవితమును బాలబాలికలు పాఠ శాలలలోనే జీవించుచూ పవిత్ర జీవితమును అలవాటుచేసి కొందురు. ఇతరదేశములు వృత్తివిద్యలకు ఎక్కువ ఆధిక్యత నిచ్చినవి. అట్లుగాక నవీన విద్య వృత్తి విద్యతోబాటు జీవిత శిక్షణకుకూడ ప్రాముఖ్యత నిచ్చుచున్నది. పాశ్చాత్య విద్యా ప్రణాళికలలో లోపించిన నైతిక జీవిత శిక్షణ మన నవీనవిద్యలో ముఖ్యముగానున్నది. జీవితశిక్షణము లోపించి నపుడు మనుష్యులు పశుతుల్యులై జీవింతురు. సుస్థిర ప్రపంచ శాంతికి, సర్వమానవ కల్యాణమునకు నిత్య నైతిక శిక్షణ

యెంతేని అవసరమని వేరు చెప్పవలయునా? Atom bomb రహస్య పరిశోధనలకంటె మానవాభ్యుదయమునకు తోడ్పడు ఆత్మ పరిశోధన యెంతో ముఖ్యము. అహింసాసిద్ధాంతము ప్రపంచశాంతికి తోడ్పడునా ? ఇది నేటి అతిక్లిష్ట సమస్య. సుదీర్ఘముగ, సూక్ష్మముగ నాలోచించిన అహింసయే రాజ మార్గమనితోచును. ఇట్టి అహింసాయుత నైతిక జీవితమును విద్యార్థులు గడపుచు, విద్యాభ్యాసము పొందుటవలన సంఘ తప్పక విశ్వమానవ సౌభ్రాతృత్వమును కలిగి ప్రపంచశాంతిని స్థాపించు ఉత్తమ పౌరులుగ తయారగుదురు. మహాత్ముడు "Education is life and life is education" అని నిర్వచించెను. పాశ్చాత్యులు "Education for life." అని వదలివేసిరి. అనగా ఎట్టి జీవితము అనునది స్పష్టపరచలేదు. విద్యయే జీవితము, జీవితమే విద్య యనుటలో గొప్ప గంభీరత గలదు. పవిత్ర జీవితమును గడపుకొనుటకు వలయువిద్య యని నిర్దుష్టముగా స్పష్టముగా నూటిగా మహాత్ముడు చెప్పుటలో పాశ్చాత్యులను అధిగమించినాడనే చెప్పవచ్చును. అనగా మహాత్ముడు నూరు (100) సంవత్సరముల అభ్యుదయమును చూడగలిగినాడు."Mahatma Gandhi is hundred years ahead of the western educators" అని యొకానొక పాశ్చాత్య విద్యావేత్త విమర్శించెను. సంఘమునకు వలయు, నిత్యజీవితమున కత్యవసరములను, ఆహారము, వస్త్రము గృహము వాని ఉత్పత్తికి తోడ్పడుచు, స్వార్థత్యాగులై,

వృత్తులుగాను, ఉపవృత్తులుగాను అవలంబించిన జీవనోపాధిని సంపాదించుకొనుటకు వీలుండును. ఇట్టి లలితకళలకు నవీన విద్యయందు ప్రముఖస్థాన మివ్వబడినది. "Basic education satisfies the aesthetic urge in man" "Nai Talim report by M. K. G". పాఠశాల అలంకరణము, వస్తు ప్రదర్శనములు, నాటక ప్రదర్శనములు, ప్రతి గదిని విద్యార్థులు స్వయముగా నలంకరించుట, ప్రతి కార్యమును కళాదృష్టితో చేయుట బేసిక్ విద్యలో ముఖ్య సూత్రములు. మొక్కలునాటుట గ్రంథములను పేర్చుట మున్నగు విషయములు బాలురు విధిగా చేయుదురు. పక్షమున కొకసారిగా పాఠశాలలోని ప్రతి వర్గమువారు ప్రతి తరగతివారును ఏదో యొకటి నాటక ప్రదర్శనమో వస్తు ప్రదర్శనమో యుపన్యాసోత్సవములు జరుపుటో తప్పనిసరిగా చేయవలెను.

వ్యక్తి స్వాతంత్ర్యమునకు ప్రతిపత్తికి ఎక్కువ ప్రాధాన్యత నిచ్చిన నేమగును? దేశాభ్యుదయమునకు, స్వ స్వత్వ మును కాపాడుకొనుట ముఖ్యమా? లేక దేశాభ్యుదయమును సాధించుట ముఖ్యమా? బేసిక్ విద్యలో దేశాభ్యుదయమునకు తోడ్పడు వ్యక్తిత్వమును అభివృద్ధి పరచుటకు తగిన శిక్షణ యివ్వబడును. విద్యాప్రణాళిక మత గురువులచే ఆదేశింపబడిన మత ప్రయుక్తమై, మతోన్మాదము, స్వాభిమానము, పరమతదూషణ మొదలగు దుర్లక్షణములకు దారి తీయును. అందువలన ఎడతెగని అంతఃకలహములు దేశ నాశనము సంభవించును. అట్లుగాక విద్యాప్రణాళిక ప్రభుత్వమువారిచే

ఆదేశింపబడిన నియంతృత్వ ధోరణిలో నడచి వ్యక్తిత్వము నశించి ప్రభుత్వము అడుగుజాడలలో నడచుకొను మాదిరి బొమ్మలుగా తయారగుదురు. వ్యక్తిగత స్వాతంత్ర్యము, వానియందుగల సర్వశక్తుల సమరస సమగ్రాభివృద్ధి జరుగ నేరదు. కాన, ఆదర్శప్రాయులైన సంఘ సేవకుల యాజమాన్యమున విద్యాప్రణాళికలు అమలు జరుగవలెను. ప్రభుత్వము విద్యా సలహాసంఘములను నెలకొల్పి, దేశములోని, ప్రపంచములోని గొప్ప విద్యా వేత్తలను సమావేశపఱచి, యొక జాతీయవిద్యా ప్రణాళికను సిద్ధపఱచి అమలు పఱచవలెను. ఏ ప్రణాళికయైనను విజయవంతముగా కొనసాగవలె నన్న అనధికార మతవాదుల హస్తగతమునుండి నిరంకుశ ధోరణిలో నడపకుండా విద్యాసలహా సంఘములద్వారా నిర్వహింప వలెను. మహాత్మా గాంధీగారు ఉద్దేశించిన ఆదర్శ నూతన సాంఘిక వ్యవస్థకు సత్యాహింసలు పునాదులుగను, సహకార సంఘీభావములు గోడలుగను నుండును. న్యాయ సమ్మతమైన, శాంతియుతమైన, జాతి మత కుల తత్త్వములు వర్ణవర్గ విభేదములులేని లౌకిక సంస్థగా ప్రజలందఱికి సమాన అవకాశములు కలదియై, ఆర్థిక, రాజకీయ సాంఘిక సమత్వము నొందు ప్రజాస్వామ్యయుతమైన సాంఘిక వ్యవస్థా నిర్మాణమునకు 'బేసిక్ విద్య సాధనము.' ఇట్టి సంఘమందు వ్యక్తులు చిన్నచిన్న సహకార సాంఘిక సంస్థలద్వారా, వ్యాపార వ్యవహారములు నల్పుకొందురు. సంఘ సంపద వ్యక్తిగతమై ధనిక వాదమునకు తావొడ్డక కుటీర పరిశ్రమలద్వారా వికేంద్రీకృతమై ప్రజలందఱికి సమముగా అనుభవించుటకు వీలగు

రామరాజ్యమునకు దోహదమిచ్చునదే బేసిక్ విద్య. ఆత్మ గౌరవమునకు సాధనము స్వయంపోషకత్వము. స్వయంపోషకత్వము స్వావలంబనము కలిగినవాడే సంపూర్ణ వ్యక్తి. సర్వతంత్ర స్వతంత్రతయే వ్యక్తిత్వము. దేశాభ్యుదయమునకు పాటుపడుటయే వ్యక్తిత్వ గౌరవము. ఇట్లు శారీరిక మానసిక నైతిక సర్వతోముఖ సమగ్ర అభివృద్ధి బేసిక్ విద్యవలన సిద్ధించును. సంఘములో "భయము" లేని సంచరింప గలిగిననాడే, ఆ సంఘమును ఉత్తమ సంఘముగా చెప్పవచ్చును. సచ్ఛీలుడు, ధర్మసంపన్నుడే యెట్టి భయమును లేక సంచరించును. సన్మార్గుడు భయమునొందనక్కఱలేదు. దుర్మార్గుడు ఎప్పటికిని భయపడును. అట్టి పరాశ్రయ జీవనము భయముతో కూడినది. స్వాతంత్ర్యత గల్గిన వ్యక్తి భయము పడనక్కఱలేదు. వాడు అభయమును పొందినవాడు. చట్టబద్ధుడైనవాడు, మానవసేవయే తన జీవిత లక్ష్యముగా కలవాడు మృత్యువునకుకూడ భయపడనక్కఱలేదు. ఏలన, "జాతస్యమరణం ధ్రువం" "మృతస్యజననం ధ్రువం" అనుతత్వ సిద్ధాంతరీత్యా చావు పుట్టుకలు ఒకటి వెనుక నొకటి వచ్చుచునే యుండును. జన్మరాహిత్యము నొందుట కడు దుర్లభము. పుట్టినవాడు చావక తప్పదు. జీవితము కొండ లోయనుండి ప్రవహించు సెలయేఱు వంటిది. ఎగుడు దిగుడులు దాటిన ప్రవాహము క్రమేణ తన మార్గమును నిరాటంకము జేసికొని పోవుచున్నది. అనుభవము, వినికిడి, జీవితమును సంస్కరించును. నీరు ఆవిరియై మేఘరూపమై, తిరిగి వర్షముద్వారా, నీరుగా పడుచున్నది. ఏనీరు ఆవిరిగా మారి

నది, తిరిగి వర్షముగా ఎచట పడుచున్నది ఎవరును చెప్పలేరు. సముద్రపునీరు కొండపైన పడవచ్చును. కొండపైని నీరు ముత్యపుచిప్పలో పడి ముత్యము గావచ్చును. జీవితము మహా నిలపరిపుష్టితాబ్జదళ నీరతుషారము వంటిది. కాయము బుద్బుదప్రాయము కాన, మరణమునకు మానవుడేల భయపడవలెను? అభయ సిద్ధాంతమును బాగుగా అర్థము చేసికొనినవాడే మానవుడు సుఖపడగలడు. సోదర మానవులను సుఖపెట్టగలడు. అభయ సిద్ధాంతములో గొప్ప శిక్షణ బేసిక్ విద్య యిచ్చుచున్నది. అహింసావ్రతుడు అభయుడు. ఎంతో మహత్తర ధైర్య స్థైర్యములు కలిగిన మానవుడే అహింసావ్రతుడు; సత్యమార్గాసక్తుడు ధర్మదేవతగా నుండగలడు. పిఱికికి పందలకు హింసాపూరితమైన జీవితము తప్పనిసరి. బేసిక్ విద్య సత్యాహింసలు, దయాధర్మములు అను మహామహిమాన్విత ఆదర్శములు కలదగుట ఆచరణ పూర్వకముగా బాలబాలికలను జీవించునట్లు చేయును. స్వార్థత్యాగి యెవరికైనను ఎందుకు భయపడవలెను? స్వార్థపిశాచి, ప్రతి యొకరికి భయపడవలసినదే. ఆత్మ సుఖముగోరు మానవుడు అభయుడు కాలేడు. పరోపకారముచేయు పవిత్రజీవికి యెట్టి భయములేదు. అట్టివాడే జీవితములో సుఖపడగలడు. సుఖముగోరువాడు సేవచేయలేడు. జీవితోన్నత ఆశయము సేవకాని, స్వీయ సుఖముకాదు. ఇట్టి సేవాసిద్ధాంత అభయ సిద్ధాంతములయందు బాలబాలికలకు బేసిక్ విద్య శిక్షణ నిచ్చుచున్నది. 'Service to humanity is Basic Education.'

మానవసేవయే మాధవసేవ. అట్టి మానవసేవాసం దాసక్తులగుటయే విద్యావంతుల లక్షణము. సంఘము సహకార సంఘీభావములచే త్యాగపూరితమైన నిష్కామ సంఘముగా (Non-Capitalistic) అహింసాయుత సంఘముగా (Non-violent) బేసిక్ విద్య శిక్షణచే పరిణామము పొందును. స్వయంపోషకత్వము, ఆత్మాభివృద్ధి సహకార సంఘ జీవిత పరిజ్ఞానము ప్రతి వ్యక్తియందును ప్రతిబింబించునట్లు చేయును.

---

## బేసిక్ విద్య — ఆచార్య కృపలానీ విమర్శన.

—: ○ :—

పాఠశాల దశయందు, విద్యార్థి జీవితావసరములగు ఆహారము, వస్త్రము, గృహము, వానికి సంబంధించిన ఉత్పత్తి కార్యక్రమములందు శిక్షణబొంది స్వాతంత్ర్యమును సాధించి, భావి జీవితములోకూడ అట్టి కార్యక్రమములనే కనీసము దినమునకు ఒక గంటకాలమైనను, సంఘసేవకై వినియోగించువాడుగా, తయారగుచున్నాడు. గాంధీజీ విద్యా ప్రణాళికను చర్చించునపుడు అతని ఉద్దేశ్యములో జీవిత తత్వమెట్టిది అను విషయమునుకూడ మనము చర్చింపవలెను. రష్యా విద్యావిధానముకాని, అమెరికా విద్యా విధానము కాని, అర్థము చేసికొనవలెనన్న ఆదేశములలోని జీవిత

తత్వమును, సంఘ నిర్మాణమును, ముందుగా అవగాహన చేసికొనవలెను. మహాత్ముడుద్దేశించిన జీవిత తత్త్వమెట్టిది ? ఆయన దృష్టిలో రాజకీయ, సాంఘిక, ఆర్థిక సిద్ధాంతములు ఏరూపమున ఉన్నవి యను విషయములను, బాగుగా అర్థము చేసికొనవలెను, ఈ విషయములు అవగాహన చేసికొనక ప్రణాళికను విమర్శించుటకు దిగరాదు. నిర్మాణాత్మకమైన విమర్శన మంచిది. అభివృద్ధికి తోడ్పడు కొన్ని సూచనలను, సలహాలను ఇవ్వవలెను. ప్రపంచమున ప్రతి దేశము, ప్రతిజాతి తన అభ్యుదయమునకొక విద్యాప్రణాళిక అవసరమని గుర్తించినవి. ప్రారంభమున ప్రతి ప్రణాళికలోను కొన్ని దోషములుండుట సహజము. వానిని శాంతియుతముగా సవరించి, దేశాభివృద్ధికి జాత్యభ్యుదయమునకు తోడ్పడునట్లు చేయవలెను. పరిశోధనలు గావించి, జాతీయ విద్యా ప్రణాళికను తీర్చిదిద్దవలెను. ఎట్టి ప్రణాళికకూడ యిది యింతే అని చెప్పుటకు వీలులేదు. ఏదికూడ సర్వోత్తమమైనదని చెప్పుటకు సాధ్యపడదు. కాలానుగుణముగ మార్పులు అవసరము గావచ్చును. విద్యావేత్తలు, ఉపాధ్యాయులు, అధికారులు తమ అనుభవములను క్రోడీకరించి, ప్రణాళికాభివృద్ధికి సహాయము చేయవలెను. వ్యక్తి సంఘ పరిసర పారిశుద్ధ్యము ప్రణాళికలోని ముఖ్యభాగము. పాఠశాలలోని విద్యార్థులు పరిశుభ్రముగా నుండుట, తమ పరిసరములను పరిశుభ్రముగా పెట్టుట, సంఘములోని వారి పరిశుభ్రతకొరకు పాటుపడుట–వీనిని బేసిక్ విద్య ఆదేశించుచున్నది. బీహార్‌లోని "చంపరాన్" ప్రాంతములో కొన్ని బేసిక్ విద్యాలయములను

దర్శించి, అందు బేసిక్ విద్యయందలి స్ఫూర్తి కేంద్ర [illegible] యుక్తాభ్యసనము, పంచేంద్రియ శిక్షణ, [illegible] సిద్ధాంతములద్వారా బాలురయందలి [illegible] చూచి, పాట్నా స్త్రీల కళాశాల [illegible] "Madam Clarisea" బేసిక్ విద్యను [illegible] చెను. బాలబాలికలయందలి ఆత్మవిశ్వాసమును, [illegible] మును పరిసరానుగుణ్యతను, కష్టములలో సమానముగా [illegible] పోవుటను, ఎట్టి ప్రేరణలేకనే తమ పనులను [illegible] నిర్వహించుకొనుటను, ఉపాధ్యాయుల ప్రమేయము [illegible] లేక బాలబాలికలు తమ జీవితమును గడుపుకొనుటను [illegible] చూచెను. నిజముగా ఇదియే సంపూర్ణ విద్యయని పొగడెను.

కాశ్మీర్ దేశపు విద్యాధికారియగు "[illegible]" (Saizidin) గారు బేసిక్ శిక్షణాలయమును పరీక్షించి [illegible] నివేదికను సమర్పించిరి. బాలబాలికలు గొప్ప [illegible] తో కూడినవారై బుద్ధి కుశలతగలవారై విద్యా[illegible] (Educational awareness) గొప్ప [illegible] శిక్షణాలయములో కనపడుచున్నారు. గ్రంథస్థమైన విద్య [illegible] విద్యకాదనియు, నిత్యజీవిత సమస్యలతో పరిచయము కల్గించి, జీవితావసరములైనవాని ఉత్పత్తికి సహాయముచేయు విద్యయే సరియైన విద్యయని పేర్కొనిరి. ప్రతి పాఠశాలయందును గ్రామసేవ సంఘసేవ మున్నగునవి ప్రతివారము విధిగా [illegible] పుటవలన దేశసేవలో చక్కని శిక్షణ పొందుచున్నారు. జాతీయ వారములలో పరిసర గ్రామములకువెళ్లి చిన్న చిన్న

బాటల నేర్పరచి, మురికి నీటిగుంటలను బాగుచేసి మంచినీటి బావులను శుభ్రపరచి, వీధులను ఊడ్చి ఆరోగ్య పారిశుద్ధ్య సూత్రములను గ్రామవాసులకు ప్రత్యక్షముగా ప్రదర్శించి, వారికి పారిశుద్ధ్యపు విలువను ఉపన్యాసముల మూలమున యక్షిణీ దీపముల (Magic Lanterns) మూలమున చెప్పు చున్నారు. ఇట్టి బాలబాలికలు భవిష్యత్తులో పెరుగుదల గాంచి, యోగ్యులై సంఘసేవచేసి, దేశాభ్యుదయమునకు తప్పక తోడ్పడుదురని నా విశ్వాసము. పై ఉత్కృష్ట ఆదర్శములు బేసిక్ విద్యయందు నిర్బంధ పాఠ్యభాగముగ చేర్చబడినవి. పూర్వము విద్యాభ్యాసములో జీవితమునకు సంబంధములేని విద్యను నేర్పుటవలన నిరుద్యోగము శాశ్వత బానిసత్వము, దారిద్ర్యము తప్పినవి కావు. ప్రస్తుత విద్యావిధానములలో జీవితముతో సంబంధించిన విషయములనే బోధించుటవలన బాల బాలికలకు మహోజ్వల భవిష్యత్తు తప్పక సిద్ధించునని చెప్ప వచ్చును భావి సంఘజీవితమునకు వలయు శిక్షణపొంది బాల బాలికలు అట్టి సంఘజీవితమును పాఠశాలలోనే గడపుట వలన జీవితము సుఖదాయకమగును.

నవీన విద్యలోని క్రియాంతర్గత సిద్ధాంతము లేక కృషి సిద్ధాంతము రష్యా మొదలగు అభ్యుదయ దేశాలలోకూడ అతిముఖ్యసిద్ధాంతముగా పరిగణింపబడినది. ముఖ్య విషయములు.

i) విద్య అంతయు ఒక పరిశ్రమద్వారా నేర్పవలెను. అనగా బోధించవలసిన విద్యావిషయములను సర్వము పరిశ్రమ లేక వృత్తితో సమన్వయపఱచవలెను.

ii) అట్టి పరిశ్రమ లేక వృత్తిద్వారా లభించు ఉత్పత్తి ఉపాధ్యాయుల వేతనములకు సరిపడు ఆదాయమునిచ్చు ఆర్థిక ప్రవృత్తిగలదై యుండవలెను.

iii) పూర్వపు విద్యావిధానమువలెగాక అనగా మాట జ్ఞాపకశక్తి ఆధారముచేసి తీసికొని బోధించక, పరిశ్రమద్వారా విద్యను గఱపుటవలన పంచేంద్రియ శిక్షణ, శాశ్వతస్మృతి బాలబాలికలయం దేర్పడును.

iv) ఇందులో క్రీడామార్గ సూత్రము కృతియుక్తాభ్యాసనము మూలసూత్రములుగా నిమిడియున్నవి. కాన, తక్కువకాలములో ఎక్కువ శ్రమలేకయే, ఎక్కువ విద్యా విషయములను నేర్పుటకు బాలుర కందఱకు వీలుండును.

v) భావి జీవితమునకు వలయు సాంఘిక జీవితశిక్షణ నిర్బంధముగా యిచ్చుటవలన సుశిక్షితులగుచున్నారు.

శారీరక అభివృద్ధిని ఎంతమాత్రము అలక్ష్యము చేయరాదు. శరీర దారుఢ్యములేని విజ్ఞానవేత్తలు, మేధావులు, అనారోగ్యులై సంఘమునకు ఎట్టి ఉపకారమును చేయలేరు. కేవలము ఏనుగంతటి శరీరదార్ఢ్యము, మానసికాభివృద్ధి

టించెను. 'కారల్ మార్క్స్' అను గొప్ప ఆర్థిక సిద్ధాంతి కృషి (కృత్యము) మంచివిద్యకు పునాదియనియు, విద్యావిషయములను కృషితో సమన్వయపఱచవలెనని నుడివెను. ఈ విద్యా సత్యములను (Educational truths) సూక్ష్మముగా పరిశీలించి విమర్శించిన బేసిక్ విద్యాప్రణాళిక అన్నియు అంతర్లీనమై చక్కని సమ్మేళనపొందిన సమగ్ర విద్యాప్రణాళిక యని చెప్పవచ్చును. సేవాగ్రాం పాఠశాలలోని ఒకటినుండి ఐదు గ్రేడులలో బాల బాలికలచే పది (10) నెలలకువచ్చిన ఆదాయము.



# JULY '43 TO APRIL '44

(220 దినములు—బడి దినములు)

| వర్గము | దినములలో పనిచేసిన కాలము | | సగటు ఆదాయము | | | గరిష్ఠ ఆదాయము | | | 30 మంది విద్యార్థుల మొత్తం ఆదాయము | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | గం. | ని. | రు. | అ. | పై. | రు. | అ. | పై. | రు. | అ. | పై. |
| I | 2 | 0 | 2 | 1 | 0 | 2 | 14 | 0 | 61 | 14 | 0 |
| II | 2 | 30 | 3 | 7 | 0 | 6 | 10 | 0 | 103 | 2 | 0 |
| III | 2 | 30 | 5 | 5 | 0 | 8 | 12 | 0 | 159 | 6 | 0 |
| IV | 3 | 0 | 14 | 12 | 0 | 16 | 4 | 0 | 442 | 8 | 0 |
| V | 3 | 0 | 15 | 1 | 0 | 18 | 9 | 0 | 4:1 | 14 | 0 |
| | | | | | | | | Total | 1218 | 12 | 0 |

వివరణ:— పై అంశములను పరిశీలించిన, 10 నెలలలో మొత్తము ఆదాయము రు. 1218—12—0 అని తేలును. అనగా నెలకు సగటున 121—14—0 వచ్చును. గాంధీగారి ఉద్దేశ్యము ప్రకారము పాఠశాలలలో మంచి రోజులలో ఒక్కొక్క ఉపాధ్యాయునికి రు. 25/— చొప్పున నిర్ణయించినారు. అనగా ఐదుగురు ఉపాధ్యాయులకు నెలకు రు. 125-0-0 అగును. అందుచే యీ ఆదాయము ఉపాధ్యాయుల వేతనమునకు సరిపోవునట్లు చూచుటలో కష్టమేమియును లేదు. ఉపాధ్యాయుడు వృథా కాలయాపన చేయక పనిచేసిన, విద్యాభ్యాసము, కృషి, జ్ఞానము, వేతనములకు సరిపోవు ఆదాయము ఉత్పత్తి చేయవచ్చును.

---

## — కారల్ మార్క్స్ విద్యావిధానము —

# బేసిక్ విద్యా విధానము

—:0:—

విద్యార్థులు శారీరక మానసిక అభివృద్ధి చెంది తమ దేశములోని వివిధపరిశ్రమల జ్ఞానమును, ఉత్పత్తి సాధనముల జ్ఞానమును పాఠశాలలయందు స్థూలముగ నేర్చుకొనవలెను. వారివారి అభిలాషలకొద్ది, ఏదైననొక పరిశ్రమయందు నైపుణ్యమును సంపాదించుకొనుటకు వీలుండవలెను. పరిశ్రమ,

విద్య రెంటికిని సమాన ప్రాముఖ్యత నీయవలెను. క్రోపాటిన్ అను విద్యావేత్తకూడ, కేవలము బుద్ధిశాలురుగాని, సంఘమునకు భారముగ నుండరు అనెను. "Public education in the U.S.S.R." అను చిన్నగ్రంథమున 'మెడిసిన్' విద్యను పరిశ్రమలతో సమన్వయపఱచవలెనని చెప్పెను. సోవియట్ విద్యావిధానములో సంఘముయొక్క అత్యావసరముల అధికోత్పత్తికి దోహదమిచ్చు వృత్తులద్వారా విద్య నేర్పుదురు. బేసిక్ విద్యలోకూడా జీవితావసరములగు అన్నము, వస్త్రము, గృహముల సంబంధమైన వృత్తుల ద్వారానే విద్యను సమన్వయపఱచుట యున్నది. అయితే బేసిక్ పద్ధతిలో విద్యార్థులు ఎట్టి భావిజీవితమును గడపవలయునో నిర్ణయించి తదనుగుణ్యముగ, అట్టి జీవితముద్వారా, అట్టి జీవితముకొఱకు, జీవితమంతయును ఆచరించుచు వృత్తి కేంద్రమైన విద్యావిషయ సమన్వయమైన జ్ఞానమును నేర్చుకొనుచున్నారు. ఒక నిర్ణీత నిర్దిష్ట నియమ జీవితప్రమాణమును లక్ష్యముగాతీసికొని అట్టి జీవితమును పాఠశాలలయందాచరించుచు, విద్యనేర్చుట బేసిక్ విద్యయొక్క ప్రత్యేకత. పైగా, పాశ్చాత్య విద్యావిధానములలో ఎట్టి జీవితమును గడపవలెనో వివరింపబడలేదు. Competitive life Might is right అవగా 'పోటీ జీవితము — బలమున్నవాడే జీవించును' అను జీవితసూత్రములను పాటింతురు. బలమునకు అర్థము పశుబలము, ధనబలముకాదు. బేసిక్ విద్యలో నైతిక బలము ఆదర్శముగా తీసికొనబడినది. కాన, బాల

బాలికలు, శారీరిక మానసికాభివృద్ధితోపాటు నైతిక
శక్తిసంపన్నులైననాడే ఆయాదేశములు బాగుపడును.
అప్పుడే మానవకల్యాణము, ప్రపంచశాంతి చేకూరును.
మహాత్ముని నూతన సాంఘిక వ్యవస్థలో కుటుంబజీవనము
ఈ విధముగానుండును. వ్యక్తుల ఆస్తిపాస్తులు సంఘాభి
వృద్ధికై నియమితము కాబడును. కుటీర పరిశ్రమలద్వారా
సంఘ సంపత్తి వికేంద్రీకృతము చేయబడును. ఉత్తమ ప్రజా
స్వామ్యలక్ష్యముగ రాజకీయముగా ప్రభుత్వము వికేంద్రీ
కృతము చేయబడును. సాంఘికముగ జాతి మత కుల వర్ణ
లింగవిభేదములులేని లౌకికసంస్థగా అందఱికి సమానావకాశ
ములు సమానగౌరవ ప్రతిష్ఠలు, సమానన్యాయము కలిగి
యుండును. సోవియట్ సిద్ధాంత రీత్యా వ్యక్తిగత ఆస్తులుం
డవు. పరిశ్రమలు కేంద్రీకృతములై ప్రభుత్వాధీనములో పని
చేయును. అందుచే వ్యక్తిస్వేచ్ఛ దెబ్బతినును. పారిశ్రామిక
విద్యయే దేశాభ్యుదయమునకు తోడ్పడునని 'లెనిన్' వక్కా
ణించెను. ఈ పారిశ్రామిక విద్య సోవియట్‌లో ఉచితముగ
నిర్బంధముగా నొసంగబడుచున్నది. ప్రతి కార్మిక కేంద్రము
నకు పారిశ్రామిక కర్మాగారములకు రష్యాదేశములో కొన్ని
పాఠశాలలు అనుబంధములుగ పనిచేయును. ఆపాఠశాలలోని
బాలురు పరిసరములనుండు పరిశ్రమస్థానముల ద్వారా
విద్యనేర్చెదరు. ఆదేశములో భారీపరిశ్రమలను కేంద్రీకృ
తము చేసినారు. మహాత్ముని ఆదర్శసంఘములో కుటీర పరి
శ్రమలకు చేతిపనులకు చిన్నచిన్న యంత్రములకు - వికేంద్రీ

కృత ఆర్థిక ప్రవృత్తికి ప్రాముఖ్యత ఇచ్చినాడు. బాలుర ఉత్పత్తినుండి వచ్చు ఆదాయము ఉపాధ్యాయుల వేతనములకు సరిపోవలెను. ఈ స్వయంపోషకత్వ సిద్ధాంతము స్వావలంబన సూత్రము — జీవితముద్వారా జీవితము కొఱకు విద్య గఱపుట — విషయములు ఏ దేశమునందును, ఎట్టి ప్రణాళికయందును, కన్పడవు. వివిధ దేశముల విద్యా ప్రణాళికలలోని విషయము లన్నియును మహాత్ముని ప్రణాళికయందు నిబిడీకృతమైయున్నవి. కాని, మహాత్ముని ప్రణాళికలోని ముఖ్య విషయములు మఱి యేప్రణాళికయందును కన్పడవు. కిండర్ గార్టన్, మాంటిసోరి, డాల్టన్, ఉద్యాన పద్ధతుల నిర్వహణ విద్యా ప్రపంచములో బహు చక్కని ప్రణాళికలు. కాని తలకు మించిన వ్యయముచేసి తక్కువమంది బాలుర్కు తక్కువ విద్యను ఎక్కువకాలములో నేర్పుట ఉచితముగాదు. స్వయంపోషకత్వ సిద్ధాంతమును ప్రతిపాదించి పై విద్యా ప్రణాళికలకు నూతన కళలను తెచ్చిపెట్టినాడు. అందువలన సులభముగా తక్కువ వ్యయముతో పెక్కుమంది బాలురు ఎక్కువ విద్యను, నేర్పుటకు వీలగును. దేశములోని బాలబాలికలకు నిర్బంధ ఉచిత విద్యా విధానము తప్పక యొసగవలెను. ప్రతి ప్రభుత్వము కనీస ధర్మమిదియే. ఇట్టి మహాత్తర ప్రణాళికను ఒక్కసారి మొత్తముగా నమలుపఱచుటకు కొన్ని లక్షల కోట్ల రూపాయలు ఖర్చగును. కాని స్వయంపోషకత్వ సిద్ధాంతమును సమగ్రముగా అర్థము చేసికొనిన, ఎట్టి ఆర్థిక చిక్కులు లేక పై వివరించిన విద్యా ప్రణాళిక నమలు పఱచవచ్చును, ఉత్పత్తి, అధికము చేయుటకు వలయు శాస్త్రీయ విజ్ఞానము.

ఉత్పత్తి సులభముగా విక్రయణీయమైనదిగా చేయుటకు వలయు కళానైపుణ్యత, సరసమైన ఖరీదు, ఆదాయము వచ్చునట్లు చేయు ఆర్థిక రాజకీయ విజ్ఞానము, వ్యాపార వ్యవహార నిపుణత్వము మొదలగు జీవితమున కుపయోగపడు అనేక విషయములు బాలబాలికలు, ఈ వృత్తికేంద్ర విద్యద్వారా నేర్చుకొనుచున్నారు. కాన, పాశ్చాత్య వాస్తవిక భౌతిక జీవితమునకు ప్రాచ్య ఆధ్యాత్మిక నైతిక జీవితమునకు చక్కని సమ్మేళనము బేసిక్ విద్య గావించుచున్నది.

---

## బేసిక్ విద్య — సాంఘిక నైతిక విలువలు.

గాంధి మహాత్ముడు పూర్వపు విద్యావిధానమును ఆధునిక సాంఘిక కోర్కెల కనుగుణ్యముగ సంస్కరించి, బేసిక్ విద్యా ప్రణాళికను ప్రవేశపెట్టెను. ఇతర దేశములలోని సంస్కరణోద్యమ పరిణామ ఫలితముగ పారిశ్రామిక విప్లవ పర్యవసానముగా విద్యావిధానములో పెక్కు మార్పులు వచ్చినవి. భారతదేశములో పరప్రభుత్వ పీడన దాస్యము తొలగించుటచే జాతీయోద్యమ ఫలితముగా వచ్చిన మార్పే బేసిక్ విద్య. ప్రజాస్వామ్యము సుస్థిరముగా నుండవలెనన్న ఉచిత నిర్బంధ సార్వజనీక కనిష్ఠ విద్యా ప్రమాణము అత్యవ

సరమని చెప్పవచ్చును. ప్రఖ్యాత విద్యావేత్తయగు "జఫర్సన్". "Education is training in Democracy" అని వ్రాసినాడు. నేటి పారిశ్రామిక యంత్రయుగములో యాంత్రిక జీవితములో మానవాభ్యుదయము పొందుచున్నామా? లేక మానవ పతనము జరుగుచున్నదా? విరివిగా మారణాయుధములను తయారుచేయుట అభ్యుదయమా? తమ దేశ సౌభాగ్యమునకై యితర దేశములను కొల్లగొని వారి జీవితములను భగ్నము జేయుట అభ్యుదయమా? ఒకరి నొకరు ద్వేషించుట అభ్యుదయమా? జాత్యహంకారము సైనిక బలము అభ్యుదయ చిహ్నములా? ఇదేనా మనము పొందదగిన నాగరికత? మానవ కల్యాణమునకై ప్రపంచ శాంతికై అహోరాత్రములు అవిరళ కృషిచేసి, శాస్త్ర విజ్ఞానమును సర్వ మానవ శ్రేయస్సునకై వినియోగపఱచుట అభ్యుదయమా? Atom bomb ఉపయోగించుట అభ్యుదయముకాదు. అది మానవ పతనమే. ఆత్మపరిశోధన చేసికొని మారణాయుధములను విసర్జించి అన్ని దేశములు మహాత్ముని అహింసా సిద్ధాంతమందు విశ్వాసము కలిగి ఆయన అడుగు జాడలలో నడచుట నిజమైన మానవత్వము; అభ్యుదయము. భౌతిక బలముపై ఆధారపడువారు హింసావాదులగుదురు. కాని, ప్రపంచ శాంతికి అహింసయే ఏకైక మార్గము. అందుకు తగిన నైతిక బలము అత్యవసరము. ఆత్మ విశ్వాసముగల వానికి నైతిక బలము చేకూరును. బేసిక్ శిక్షణ ద్వారా ఆధ్యాత్మిక నైతిక బలములు పెంపొంది స్థిరముగనుండును.

ప్రతి దేశములోను ఆ యా దేశముల రాజకీయ, సాంఘిక ఆర్థిక దృష్ట్యా విద్యా ప్రణాళికలు తయారైనవి. మహాత్ముని బేసిక్ విద్యా ప్రణాళిక అట్లుగాక సుస్థిర ప్రపంచ శాంతియే లక్ష్యముగా తయారైనది. ఒక దేశమునకే కాక ప్రపంచమునకే పనికివచ్చు ప్రణాళిక బేసిక్ విద్యా ప్రణాళిక. విద్యార్థులు పాఠశాలలయందు అలవాటు చేసికొను జీవితమునే భవిష్యత్తులో గడపెదరు. కాన ఎట్టి మహోత్కృష్ట పవిత్ర జీవితమును భవిష్యత్తులో వారు గడపవలెనో దానిని మనమే ముందుగా నిర్ణయించి, అట్టి జీవితమును వారిచే ఆచరింపను నట్లు చేయుచున్నాము. జీవితములో స్వాతంత్ర్య జీవితమున యొక్క వృత్తిని, వృత్తిజ్ఞానమునూ, బేసిక్ విద్య నేర్పుచు చున్నది. రాజకీయముగా ప్రభుత్వశక్తి వికేంద్రీకృతమై ప్రజాస్వామ్యమై ఆర్థికముగా, కుటీరపరిశ్రమలద్వారా సంఘ సంపద వికేంద్రీకృతమై అందఱికి సమాన ఆర్థిక స్థాయి కలిగి సాంఘికముగ, జాతి, మత, వర్గ, వర్ణ, లింగ విభేదములు లేని యొక్క నూతన సాంఘికవ్యవస్థను, బేసిక్ విద్యద్వారా నిర్మించు చున్నాము. అట్టి సాంఘిక వ్యవస్థకు పౌరులుగా బాలబాలి కలకు శిక్షణ నిచ్చుటయే ప్రణాళికయొక్క ఉద్దేశ్యము. ఒకనాటిలో పౌరశిక్షణ సాంఘిక ప్రవర్తన అలవడదు. నైతిక జీవనము, కేవలము ఉపన్యాసములద్వారా సిద్ధించునది కాదు. ప్రజాస్వామ్యమును గుఱించి పెక్కు గ్రంథములు చదువవచ్చును. గొప్ప ఉపన్యాసములు వినవచ్చును. కళాశాలయందు ప్రజాస్వామ్యములో విద్యా కోవిద బిరుదము (Doctorate) ప్రథమ శ్రేణిలో పొందవచ్చును. కాని,

జూపుట, వారి వారి బాధ్యతల నిర్వహించుచు, వారి వారి హక్కులను కాపాడుకొనుట, స్వీయసంఘ పారిశుద్ధమునకై పాటుపడుట, సంఘోత్పత్తికై అవిరళ కృషి చేయుట, సద భ్యాసముల నలవాటు చేసికొనుట మున్నగునవి ముఖ్యమైన సూత్రములు. వృత్తి విద్యతో విద్యా విషయములను సమన్వయపఱచుచు ప్రజాస్వామ్య జీవితమును విద్యార్థులు గడపునట్లు చేయవలెనని చెప్పెను. పాఠశాలలలో విద్యార్థులు స్వయంపరిపాలనకు సరియైన ప్రాముఖ్యమును ఇచ్చినచో విద్యార్థులలో అంతర్గతమైన మహత్తర శక్తులు ప్రజ్వరించి సరియైన మార్గమున క్రమపరుపబడును. అట్లు కానినాడు, సంఘ విద్రోహక దేశవినాశక చర్యలకు దారితీయును. కాన, బేసిక్ విద్య ఉత్తమోత్తమమైన విద్యాప్రణాళిక యని నిస్సంశయముగా చెప్పవచ్చును.

---

## బేసిక్ విద్యయందలి మూలసూత్రములు.

రూసో, పెస్టిలాజీ, ఫ్రీబెల్, హెర్బార్ట్, మొదలగు విశ్వవిఖ్యాతులలోని మూలపురుషులు, కిల్‌పాట్రిక్, మాంటిసోరి, మొదలగు విద్యావేత్తలు కృతియుక్తాభ్యాసనము అతి ముఖ్యమైన జీవిత సూత్రమని నిర్వచించిరి. "Activity and craft-work as a necessary part of education" మహాత్ముండు

తన ఆర్థిక సిద్ధాంత దృష్ట్యా – వికేంద్రీకరణ సిద్ధాంతము—. వృత్తులను నిత్యజీవితమున కత్యవసరములగు అన్నము, వస్త్రము, గృహము, చిన్న చిన్న కుటీర పరిశ్రమలు అని నిర్వచించెను. కాన మహాత్ముడు తన విద్యాప్రణాళిక ద్వారా తన నూతన ఆర్థిక సిద్ధాంతమును రాజకీయ సాంఘిక సిద్ధాంతములను,—Non violence and Satyagraha principles—ప్రవేశ పెట్టుచున్నాడు. ఈ ముఖ్యమైన పది సూత్రములు మహాత్ముని ప్రణాళికయందు గమనింపదగును.

(i) దేశములో అందరికి ఒక కనిష్ఠమైన లింగవిభేదము లేని విద్యా ప్రమాణ మివ్వవలెను. ఆదిలో నిర్బంధము చేయక పోయినను, అవకాశము లభించుకొలది అట్టి విద్యను నిర్బంధము చేయవలెను. ఈ సార్వజనీనక కనిష్ఠ విద్యా ప్రమాణమును ఆయన బేసిక్ విద్యయని పిలిచెను. ప్రస్తుతము అమలులోనున్న విదేశ విద్యావిధాన మెంతమాత్రము జాతీయము కాదని తన క్రొత్త ప్రణాళికను జాతీయ విద్యా ప్రణాళికయని నిర్వచించెను. (Theeore it is called Basio National Education The latest Fad page 78).

(ii) బాల బాలికలు ఏడవ సంవత్సరమునుండి, ఏడు యేండ్లు—అనగా, వారికి పదునాలుగేండ్లు నిండువరకు—విద్య నభ్యసించవలెను.

(iii) బేసిక్ విద్య (Pre – school stage) పాఠశాలకు పోవుటకు పూర్వమునుండి యొక దశగాను, ( Post basic stage ) పాఠశాల వదలిన తరువాత మఱొక దశగాను, పాఠ

శాలలో ఏడునుండి పదునాలుగువరకు ఒక దశగాను విభాగింప బడినది.

(iv) బేసిక్ విద్యా విధానము ముఖ్యముగా విధిగా, మాతృభాష ద్వారానే గడపవలెను.

(v) ఆచరణలో ఒక వృత్తిని లేక చేతిపనిని కేంద్రముగా తీసికొని, విద్యా విషయములను అనగా తెనుగు, గణితము, శాస్త్రము, చరిత్ర మొదలగునవి సమన్వయ పరుచవలెను. మానసిక శిక్షణ, భౌతిక శిక్షణతో పాటు ఏకకాలమున జరుగవలెను. వృత్తి లేక చేతిపని ఆధారముగా మానసిక వికాసము, వృత్తి, జ్ఞానము పొందవలెను.

(vi) వృత్తి శాస్త్రీయముగను, క్రమపద్ధతిలోను, నైపుణ్యముగను, ప్రయోజనకారిగను ఉండునట్లు నేర్పవలెను. కేవలము జ్ఞానముకొరకే కాక, కేవలము ఆర్థికముగా, ప్రయోజన కారియగుటకే గాక అనగా, స్వయంపోషకత్వము పొందుటయే కాక—రెండు లక్ష్యములను ఏక కాలమున, దేనిని అలస్యము చేయక, దేనికిని ఎక్కువ ప్రాముఖ్యతే నివ్వక రెంటిని సాధనముగాను, లక్ష్యముగాను పొందవలెను—నేర్పవలెను.

(vii) చేతిపని లేక వృత్తిద్వారా విద్యా జ్ఞానమును పొందుచు ఆర్థికముగా లాభకారియై యుండవలెను. అనగా విద్యార్థికిగాని సంఘమునకుగాని ఆర్థికముగా ఉపయోగపడునట్టిదిగ నుండవలెను.

(viii) విద్యార్థులు సాధించు ఉత్పత్తివిలువ కనీసము. ఉపాధ్యాయుల వేతనమునకు సరిపోవునట్టిదిగ నుండవలెను విద్యనేర్పవలెను. వృత్తి నభ్యసించవలెను.

(ix) ఆయా ప్రభుత్వములు రాష్ట్రములుగాని కేంద్రముగాని ఉపాధ్యాయుల వేతనములు మినహా అగు పాఠశాలా భవనముల సాధన సామగ్రి, గ్రంథములు, తదితర బోధనోపకరణములు, వృత్తికి సంబంధించిన పరికరముల ఖర్చులు భరించవలెను.

(x) పాఠశాలలలో విద్యార్థులచే ఉత్పత్తి చేయబడిన వస్తుసంపదను ఆయా రాష్ట్రప్రభుత్వములు, స్థానిక రాష్ట్రి అవసరములకై వినియోగ పఱచవలెను. ఒక్కొక్కప్పుడు కేంద్రప్రభుత్వముతో సంప్రతింపులుచేసి కేంద్రము ద్వారా వినియోగ మగునట్లు చూడవలెను.

పై ముఖ్య సూత్రములను విడివిడిగా విమర్శించక ప్రణాళికను ఏకాండముగా చూచిన ప్రణాళికలోని అంతరార్థముబోధపడును. బేసిక్ శిక్షణ ద్వారా సుశిక్షిత పౌరులు తయారగుదురు. ఆర్థిక సమత్వము సమాన ప్రతిపత్తి ఆత్మగౌరవము కలిగి, పౌరులు సంచరింతురు. నిర్భయముగా జీవించుటకు వీలుండును. శాశ్వత ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపన యేర్పడును.

# స్వయంపోషక తత్త్వ సూత్రము.

వృత్తి కేంద్ర విద్యద్వారా విద్యాబోధన జరగడము బేసిక్ విద్యయందలి ప్రధాన ఆశయము. అభ్యసించిన వృత్తి స్వయంపోషకత్వము గలిగి విద్యాబోధనకు తోడ్పడునట్టిదిగా నుండవలెను. మహాత్ముడాశించిన విధముగా ఉపాధ్యాయుల వేతనమునకు సరిపోవు ఆదాయమును సంపాదించు ఉత్పత్తిని సాధించునట్టి వృత్తిని కేంద్రముగా తీసికొని విద్య నేర్పవలెను. విద్యాప్రణాళికలోని వివిధ విషయములను అంశములను ఈ వృత్తికి సమన్వయ పఱచవలెను. ఇదియే వృత్తి కేంద్ర కృతి యుక్తాభ్యసన సిద్ధాంతము. అతి జాగ్రత్తతోను శాస్త్రీయముగాను, వృత్తిని సాధించుచు విద్య నేర్చిన జ్ఞానమును జీవితమును సాధించుటకు ఒక మార్గము యేర్పడును. ప్రయత్నము అనగా పెట్టుబడి దుర్వినియోగము కాకుండా తయారైన ఉత్పత్తి ఆకర్షణీయముగా నిత్యజీవితమున కుపయోగపడునట్టిదిగా, బజారులో సరియైన ధరలకు విక్రయింపబడుటకు ఈ స్వయంపోషకతత్త్వ సూత్ర మెక్కువగా తోడ్పడును. వృత్తి నేర్చుకొనుట విద్యకు సాధనమే కాక అదియే విద్యయని గాంధీజీ వివరించెను. అట్లుగానిచో ఊరకనే ప్రొద్దుపోవుటకు వృత్తి నభ్యసించి పెట్టుబడిని ముడిసరకును నాశనము చేయుడము జరుగును. వృత్తియందు నిపుణత్వమును సాధించుటకు వీలుండదు. ఎప్పుడైతే బజారులో మనవస్తువులు విక్రయింపబడునో అపుడు మనకు సరియైన ఆదాయము చేకూరును. ఆదాయము

చేకూరుటకు వస్తువును అకర్షణీయముగా ఉపయోగపడు నట్లుగా తయారుచేయవలెను. అట్లు చేయవలెనన్న శాస్త్రీయముగా నియమబద్ధముగా ఒక నిర్ణీత ప్రణాళిక ననుసరించి వృత్తి నభ్యసించవలెను. తక్కువ వ్యయముతో యెక్కువ నైపుణ్యమును సాధించుటయే స్వయంపోషక తత్వలక్ష్యము ఏ విద్యావిధానములోనూ లేని యీ నూతన విద్యా సూత్రమును మహాత్ముడు ప్రవేశపెట్టి విద్యాజగత్తులో నొకమహత్తర విప్లవమును లేవదీసినాడు. అనేకులు అనేక విధములుగా విమర్శించిరి. నిష్పక్షపాతముగా విమర్శించిన నిజము అర్థమగును. విద్యార్థులకు అటు విద్యరాక ఇటు వృత్తిరాక ఉభయభ్రష్టత్వము పోవును. కాన, ఈ స్వయంపోషకత్వ సూత్రము వలన శీఘ్రముగా, సులభముగా, యథార్థమైన శాశ్వతమైన, జ్ఞానము లభించుటయే గాక, జీవన భృతికూడ నేర్పబడు చున్నది ఇట్టి తర్ఫీదు పొందిన విద్యార్థులు యెన్నటికిని ఒకరిపై నాధారపడు బానిసత్వమునకు గురికారు. దేశములో నిరుద్యోగసమస్య అను ప్రశ్నయే యుండదు. ప్రతియొకరు సర్వస్వతంత్ర స్వతంత్రులై స్వావలంబన స్వయంపోషకత్వము గలిగి సమగ్ర సర్వతోముఖాభివృద్ధి జెంది, పూర్ణ మానవత్వమును బొంది జీవింపగలరు.

విద్య యను లక్ష్యమునకు వృత్తిసాధనముగా పని జేయును. అటులనే వృత్తియను లక్ష్యమునకు విద్య సాధనముగనుండును. కావున. వృత్తికి సహాయపడు విద్య, విద్యకు

సహాయపడు వృత్తి నేర్పవలెను. నేటి విద్యావిధానములో వృత్తికి సంబంధములేని అనగా జీవితమునకు సంబంధములేని విద్యను నేర్పుట జరుగుచున్నది. విద్య ముగిసినతర్వాత ఆ విద్యార్థి యేవిధముగా బ్రతుకగలడు? అను ప్రశ్న ప్రతియొక విద్యావేత్తను, విద్యార్థిని తీవ్రముగా బాధించుచున్నది. బేసిక్ విద్యావిధానములో యిట్టి సమస్యయే ఉదయించదు. స్వతంత్రముగ జీవించుటకు వలయువిద్యను సాధించుచున్నాడు ఈ విద్యావిధానమున వృత్తి, మఱియు విద్య యేకకాలమున నేర్పును. కావున, తనయొక్క స్వతంత్రజీవనమునకు వలయు వృత్తినైపుణ్యము సాధించునంతవఱకు విద్యను నేర్పును నేటి విద్యావిధానములో పరీక్షలలో బాలుని జ్ఞాపకశక్తిని (స్మృతి) పరీక్షజేయుచున్నారు. కాని, ఆవిద్యార్థి యెంతవఱకు జ్ఞానమును పొందినాడు? ఎట్టి జ్ఞానమును పొందినాడు? దాని వలన వాడు స్వతంత్రముగా సంఘములో జీవింపగలడా? అను ప్రశ్నలు వేసికొన్న జవాబు దొరకదు. కావున విద్యయొక్క లక్ష్యము స్వతంత్రజీవనము సాధించునట్టిదియు, సహకార సంఘీభావమును పెంపొందించునట్టిదియు, తాను బ్రతికి యితరులను బ్రతికించునట్టిదియు (Live and let Live)గ నుండవలెను. అందుకొఱకు విద్యావిధానమున మహాత్ముడు ఈ స్వయంపోషక సూత్రమును ప్రవేశపెట్టినాడు. ఇందలి లాభములు 1. విద్య శాస్త్రీయముగ నేర్పబడును. 2. ఎక్కువ నైపుణ్యమును విద్యార్థులు గడింతురు. 3. వృథా కాలయాపన జరుగుటకు వీలుండదు. 4. పెట్టుబడి ముడిసరుకు దుర్వి

నియోగము కాజాలదు. 5. ప్రభుత్వమునకుగాని మానేజి మెంటుకుగాని ఆర్థికముగ లాభదాయకముగ నుండును. 6. నిర్బంధ విద్యావిధాన మమలుపఱచుటకు వలయు ఆర్థిక ప్రతిపత్తి దీనివలన సిద్ధించును.

గాంధీగారి శిష్యుడైన 'వినోబాభావే' ఆధ్వర్యమున నిర్వహింపబడిన వార్ధాలోని 'నల్వాడే' ఆశ్రమములో ఒక బేసిక్ పాఠశాలయందు 7 నుండి 14 సం॥ వయసుగల పిల్లలు దినమునకు 2 గంటల చొ॥ రాట్నముపై నూలువడకిన సరాసరి ఒక్కొక్కరికి నెలకు రు. 1—8—0 ఆదాయము వచ్చెనని తెలియవచ్చుచున్నది. విద్య నేర్చుకొనుచూ విద్యార్థులు యింత మాత్రము సాధించిన ఆ పాఠశాల సంపూర్ణ స్వయంపోషకత్వము వహించియుండును. పారిశ్రామికవిద్య నభ్యసింపవలెనన్న కనీసము 18 సం॥ ప్రాయముండవలెను. అప్పుడే తగిన మనోవికాసము కలుగును. కాని ఈలోపుగ అటువంటి పారిశ్రామిక, సాంకేతిక విద్యకు దోహదమిచ్చెడి చిన్నచిన్న కుటీర పరిశ్రమలు, చేతిపనులు నేర్చుకొనవచ్చును. బాల్యమున తకిలీపైనను తరువాత రాట్నముపైనను, క్రమేణ మగ్గములపైనను వస్త్రములు తయారుచేయుట నేర్చుకొనవచ్చును. ఇట్లు ఆపరిశ్రమయందు ఆవిద్యార్థి పరిపూర్ణత సాధించవచ్చును. ఇట్లు సాధించిన విషయజ్ఞానము, వృత్తినైపుణ్యము స్వతంత్రజీవనమునకు తోడ్పడదని ఎవరు అనగలరు? కనుక గాంధిగారి బేసిక్ విద్య కేంద్రీకృత లేక వికేంద్రీకృత పారిశ్రామిక దేశ

ములకైనను అనువుగానేయున్నది. ఆర్థికముగ సహకార ప్రశ్రమలద్వారా సంపద వికేంద్రీకృతమై పరిపాలనాత్మక అధికారము వికేంద్రీకృతమై యుండునట్టి రాజ్యమే రామరాజ్యమని స్వర్గతుల్యమని నిర్వచింపబడెను. ఇట్టి ప్రజాస్వామ్యమునకు బేసిక్ విద్య పునాదులు వేయుచున్నది. స్వతంత్రనాయకస్థానము, వికేంద్రీకృత అధికారము, సంపద నిజమైన ప్రజాస్వామ్యమునకు పునాదులు. ఇట్టి బేసిక్ విద్య పవిత్రమైన ప్రజాస్వామ్య సిద్ధాంతమునకు మానవకల్యాణమునకు విశ్వశాంతికి తోడ్పడుచున్నది.

బేసిక్ విద్యాలయములలో తయారైన వివిధ వస్తుసంపదను ఆయారాష్ట్రప్రభుత్వములు కేంద్రప్రభుత్వములు సహాయముపై తీసికొని, విక్రయమునకు తోడ్పడవలెను. రాష్ట్రప్రభుత్వములోని ఎగుమతి దిగుమతులను, ఉత్పత్తి వినియోగములను ఒక నిర్దిష్ట ప్రణాళిక ననుసరించి ప్రభుత్వములు క్రమపరచి, ప్రతి పాఠశాల స్వయంపోషకత్వము వహించును. ప్రభుత్వమునకు ఆదాయమును చేకూర్చును. అందుకు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వ సహకార మత్యవసరము. కొన్ని సమయములందు టారిఫ్ Tareeff మొదలగు వ్యాపార నిషేధములను అమలుపఱచి, ఉత్పత్తి వినియోగములను క్రమపరచవలెను. ప్రాథమిక ఆర్థిక విద్యావకాశములు బేసిక్ విద్యయందు అతినైపుణ్యముగ సమకూర్పబడినవి.

8. విద్యాబోధన సమన్వయ సిద్ధాంతము ననుసరించి యుండవలెను.

9. పాఠశాలయందు సిద్ధమగు ఉత్పత్తి ఉపాధ్యాయుల వేతనములకు సరిపడు ఆదాయమును తెచ్చునదిగ యుండవలెను.

10. పాఠశాలయొక్క ఉపాధ్యాయ వేతనములు తప్ప ఇతర ఖర్చులను ప్రభుత్వమే భరించవలెను. పాఠశాలా భవనము, పరికరములు, సాధన సామగ్రి పుస్తకములు వ్యవసాయమునకు తగు భూమి వృత్తి పరికరములు మొదలగు వాని ఖర్చులు ప్రభుత్వమే భరింపవలెను.

11. పాఠశాలలోని ఉత్పత్తి వినియోగమునకు రాష్ట్రకేంద్ర ప్రభుత్వములు సహకరించవలెను. స్థానిక సంస్థల ద్వారా లేక తమ అనుబంధ సంస్థలద్వారా విక్రయశాలలు నేర్పఱచవలెను.

12. ఉపాధ్యాయులు వృత్తులయందును విద్యయందును ఆరితేరిన నిపుణులుగానుండి యెక్కువ శ్రద్ధ వహించి అత్యుత్సాహముతో క్రొత్తక్రొత్త నమూనాలు కనిపెట్టుచు ఉత్పత్తిని ఆకర్షణీయముగ ఆదాయమును తెచ్చునట్టిగ ఉపయోగకరమైనట్టివిగ నుండునట్లు తయారు చేయించవలెను.

13. బాలురు జీవితముద్వారా జీవితముకొఱకు జీవితమంతయు విద్య నేర్వవలెనను 'Education for life, through life. and throughout life'' బాలురకు సరియైన పొరశిక్షణ యివ్వబడి వర్గరాహిత్యమైన ఆర్థిక సమత్వము గలిగిన సార్వత్రిక ప్రజాస్వామ్య లౌకిక సంఘవ్యవస్థా నిర్మాణము జరుగవలెను.

# బేసిక్ విద్య గాంధీగారి జీవిత తత్త్వము

What is Life? what kind of life snould we expect the boys to have? బేసిక్ విద్య జీవితము కొఱకు జీవితము ద్వారా జీవితమంతయు అని నిర్వచింప బడినది. అయితే ఈ జీవితము యెట్టిదిగా నుండవలెను? గాంధీగారి జీవితతత్త్వమెట్టిది? అను ప్రశ్నలకు సమాధానము అన్వేషింపవలెను ఇది తెలియునిచే బేసిక్ విద్య పూర్తి కానేరదు. పాశ్చాత్య దేశములలో నైతిక ప్రవర్తనకు ప్రాముఖ్యతలేని భౌతిక వస్తుతత్త్వము (Materialism) ఒకరకమైన జీవిత తత్త్వము. కేవలము నైతిక ఆధ్యాత్మిక చింతనయే పరమావధి యని శరీరమును శుష్కింపజేసి, సుఖములను విసర్జించి, ఇహమును లెక్క పెట్టక పరమునే పరమలక్ష్యముగా జీవించెడి భారతీయుల లేక ప్రాచ్యదేశీయుల జీవిత తత్త్వము ఒక రకము. దీనిని (Spiritualism) అందురు. మఱి విద్యార్థులను అధునాతన యాంత్రిక యుగములో ఆధ్యాత్మిక తత్త్వజిజ్ఞాసులుగా

నెట్లు తయారు చేయవలెనో నిజముగా నొక పెద్దసమస్యగా నున్నది,

వ్యక్తియొక్క సమగ్ర సర్వతోముఖాభివృద్ధికి అనగా శారీరక మానసిక నైతిక అభివృద్ధికి శిక్షణ నిచ్చునదే విద్య. అరిషడ్వర్గపరివృతమైన మానవుని యందలి పశుత్వమును ఉదాత్తము జేసి సంపూర్ణమానవత్వమును వికసింపజేయుటయే విద్యయొక్క పరమావధి. ఇట్టి అభివృద్ధిని వ్యక్తిసమూహ సహవాసముచే గాని సంఘ సంపర్కముచే గాని సహజాతముగా గాని పాఠశాల ద్వారాగాని పొందును. కనుక, వ్యక్తియొక్క అభివృద్ధి అన్నిటికన్న సాంఘిక వాతావరణ ప్రాబల్యము మీదనే ఆధారపడయున్నది. సాంఘిక వాతావరణము రాజకీయ ఆర్థిక పరిస్థితులనుబట్టి మారుచుండును. ఇట్లు పరిణామముజెందు సంఘముతోబాటు వ్యక్తి కూడ మారవలెనా? లేక సరియైన ఆర్థిక రాజకీయ వాతావరణమును వ్యక్తియే సృష్టించుకొనవలెనా? తన వ్యక్తిత్వమునకు భిన్నము గాకుండ సంకుచిత సంఘమును సంక్షుభిత ఆర్థిక స్థితిని సంస్కరింప గలిగిన వాడే విద్యావంతుడు. అట్టి విద్యాశిక్షణ బేసిక్ విద్య ద్వారా సిద్ధించుచున్నది. అహంకార పూరిత స్వార్థపరత్వమును, వర్ణవైషమ్యములు, మత విద్వేషములు జాత్యహంకారములు, మొదలగు దుష్టశక్తులకు తావులేని అతీతమైన లౌకిక వ్యక్తులను సృష్టించుటయే బేసిక్ విద్యయొక్క యేకైక లక్ష్యము, సత్యము, అహింస, ధర్మము, దయ

మొదలగు మానవజాతి ప్రాథమిక సూత్రములను ఆచరణలో పెట్టి సహకార సంఘీభావములతో సౌహార్ద్ర సౌభ్రాతృత్వముతో 'వసుధైవం ఏక కుటుంబానాం' అను మహత్తర సిద్ధాంతములను పాటించి, మానవ కల్యాణమునకు విశ్వశాంతికి తోడ్పడుటయే మహాత్ముని జీవితతత్త్వము, బుద్ధుడు, క్రీస్తు, మహమ్మదు, రామకృష్ణపరమహంస, మహాత్ముడు మొదలగు వ్యక్తులు తమవ్యక్తిత్వముచే సంఘమును సంస్కరించి, తమతోపాటు సంఘమునకు కూడ మోక్షము కలిగించిన వారైరి. సంఘము, వ్యక్తి ఒకరితో నొకరు అన్యోన్యముగా, పరస్పరముగా అభివృద్ధిచెంద వలయును. సంఘమును త్యజించి వ్యక్తి, వ్యక్తి అభివృద్ధికి తోడ్పడని సంఘము అభ్యుదయము చెందజాలవు. సంఘాభివృద్ధికి తోడ్పడు వ్యక్తిత్వము నాగరకతాలక్షణము. ఇట్టి నాగరకతను ఆపాదించుటయే విద్యయొక్క పరమాశయము. వీనికి సత్యము, అహింస, ధర్మము దయ జీవిత సూత్రములుగ నుండవలెను. ధనికవాదము, స్వార్థ స్వసామ్రాజ్య పరపీడనా సిద్ధాంతములకు స్వస్తి జెప్పి సహకారసంఘ జీవితము ఆర్థిక సమత్వము సమాన ప్రతిపత్తిని కలిగిన సంఘనిర్మాణము జీవితము నిజమైన జీవితతత్త్వము,

పై జీవితతత్త్వమునకు మహాత్ముని ఖాదీ ఉద్యమము అస్పృశ్యతానివారణ, కుటీర పరిశ్రమలు, మద్యపాన నిషేధము మొదలగు సంస్కరణములు యెట్లు తోడ్పడునో పరిశీలించవలయును. ఖాదీ ఉద్యమము కుటీరపరిశ్రమలు చేతిపనుల

ద్వారా, ఆర్థిక వికేంద్రీకరణ కలిగి, సమత్వ మేర్పడి సమాన ప్రతిపత్తి సిద్ధించును. ప్రతివ్యక్తియు స్వయంపోషకత్వమును బొంది సర్వతంత్ర స్వతంత్రుడై జీవించును. ప్రజాస్వామ్యము అధికార వికేంద్రీకరణకు తోడ్పడును. అస్పృశ్యతా నివారణ మతసామరస్యము మతసహనము మొదలగు సుద్యమములు సంఘమును సంస్కరించ గలవు. చరిత్రలో కనివిని యెరుగని రక్తపాతములేని అహింసాత్మక విప్లవమును లేవదీసి రవి అస్తమించని బ్రిటిష్ మహా సామ్రాజ్యమును భారతదేశము నుండి తొలగించుట యెట్లు నెరవేరినది పాఠకులకు విదితమే. కొన్ని యేండ్లగా విప్లవముల ద్వారా యెక్కువ రక్తపాతముతో అనేక మారణ హోమముల ఫలితముగా పాశ్చాత్య దేశములలో స్వాతంత్ర్య సిద్ధి జరిగినది. Oc ober Revolution of Russia - The Great French Revolution - 100 years of American War of Independence మొదలగు స్వాతంత్ర్య సమరములను విద్యార్థులు చదువవలెను. శాంతియుత, సత్యాగ్రహములతో అహింసయే ప్రపంచశాంతికి ముఖ్యసాధనమని మహాత్ముడు నిరూపించెను. పాశ్చాత్య సిద్ధాంతములను అహింసాత్మకముగా సాధించి రాజకీయము లందు నైతిక బలమును ప్రవేశపెట్టినాడు. (Ethics in Politics) అవినీతికరమైన రాజకీయమును నీతివంతము జేసిన ఘనత మహాత్మునకు దక్కినది.

'Live and Let live' తాను నివసిస్తూ ఇతరులను నివసింపజేయుట మహాత్ముని తత్వము. దీనినే 'సర్వోదయ

సిద్ధాంత' మందురు. అనగా సత్యాహింసలే ప్రమాణములుగా గల జీవితమును గడుపుటయని అర్థము. "ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకం" (One World theory) సర్వోదయ లక్ష్యముగా నున్నది. ఈ యేక కుటుంబ భావము అందరి యందును కల్గిన ప్రతిఫలము కోరుట అంటూ యుండనే యుండదు

మానవుని లో సహజ గర్భితమైన ఆధ్యాత్మిక తత్త్వానికి ప్రాధాన్యత నిచ్చే ప్రాచ్య సిద్ధాంతాన్ని తాత్కాలిక అభ్యుదయానికి వాస్తవికతకును అతివాస్తవికతకు నెక్కువ ప్రాధాన్యత నిచ్చేపాశ్చాత్య సిద్ధాంతానికి సమన్వయం కుదురుట యెట్లు? ఏ జీవితతత్త్వము శ్రేష్ఠమైనది? సుఖముగా జీవించుట యా లేక తాను కష్టపడి ఇతరులను సుఖపెట్టుట యా? ఏది ఉత్కృష్ట జీవనము? విద్యార్థులే ఊహించవలెను. శాస్త్రవిజ్ఞానము దుర్వినియోగము కాకుండ లోక కల్యాణమునకు యెట్లు తోడ్పడగలదు? (ఏ జీవితతత్త్వమైతే విశ్వశాంతికి తోడ్పడునో, 'వసుధైవ కుటుంబకం' లక్ష్యమును సాధించునో అట్టిజీవిత తత్త్వ మత్యుత్తమమైనదిగా సర్వోత్కృష్టమైనదిగా మహోజ్వలమైనదిగా భావించవలెను.)

విషయ ప్రాధాన్యతలో ప్రాచ్యపాశ్చాత్య దృక్పథములు భేదించినప్పటికి మానవత్వానికి సంబంధించిన అంశాలకు ఇండియా, చైనా, గ్రీసుల వేదాంతులు ప్రాధాన్యత నిచ్చినారు. మానవునిలో అంతర్లీనమైన సత్యపదార్థమునకు

ప్రాధాన్యత ప్రతి యొక్కరును గమనించి గర్వించినవారే గ్రీసులో బాహ్యప్రపంచపు స్వభావమును గుర్తించినారు. భారతదేశములో ఆంతరంగిక తత్త్వమునకు ప్రాధాన్యత నిచ్చినారు. చైనా దేశములో మానవునికి తోడిమానవులతో గల సంబంధమును గుర్తించినారు. అరబ్బీయుల సూఫీతత్వము మన వేదాంతము వలెనే యుండును. మానవునిలో గర్భితమైన సత్యపదార్థము శాశ్వతమైనదని గుర్తించడమువలన సంఘములోని బాధలకు మిథ్యయను నిర్వచన మివ్వబడినది. సాంఘిక దురాచారములను తొలగించుటకు ప్రాచ్యజాతులు శ్రద్ధవహించక పోవడమున కిదియే కారణము. ఆధ్యాత్మిక దృష్టితో నడచిన భౌతిక అభ్యుదయమును పొందలేము. భౌతికవస్తుతత్త్వము ననుసరించిన ఆధ్యాత్మికాభ్యుదయమును సాధించలేము. మఱి ఈరెండింటి సమ్మేళన మెపుడు జరుగును? ఎట్లుజరుగును ?

విద్యార్థి యెట్టి ఆదర్శమైన సంఘ జీవితమును గడపవలెనో అట్టి జీవితమును పాఠశాలయందు కల్పించి అభ్యసింపజేయవలెను. అప్పుడే మహాత్ము డాశించిన నూతన సాంఘిక వ్యవస్థకు విద్యార్థి తోడ్పడును. [వ్యక్తి ఆత్మాభివృద్ధికిని సంఘశ్రేయస్సునకును తోడ్పడు విద్యయే విద్య. [illegible] వృన్న సత్ప్రేరణత్వ సాంఘిక శిక్షణయే బేసిక్ విద్య.]

సామ్రాజ్య కాంక్షతో కూడిన దౌర్జన్య పశుత్వ పరపీడనా సిద్ధాంతములు యితర దేశములలో విద్యా లక్ష్యము

లుగానున్నవి. Spartons, Germany, Italy మొదలగు జాతులు Fascist సిద్ధాంతములను విద్యాలక్ష్యములుగా కలిగినవి. అమెరికా, ఇంగ్లాండు దేశముల యందు సామ్రాజ్యవాదము, పరపీడన, మొదలగునవి విద్యాలక్ష్యములుగా నున్నవి. ప్రాచ్య దేశములలో ఆధ్యాత్మిక తత్త్వమే విద్యా ప్రమాణముగా గైకొనబడినది. అటు వస్తు తత్త్వమునకు ఇటు ఆధ్యాత్మిక తత్త్వమునకు యెట్లు సమన్వయము కుదురును. వస్తు తత్త్వజ్ఞులు మనకన్న యెక్కుడు అభ్యుదయమును సాధించిన నిజమును మనము విస్మరించలేము. నేటి ఆధునిక యంత్రిక యుగములో అట్టి తత్త్వమే విశేష ప్రాబల్యము కలిగి యున్నది. ఈ విషమ సమస్య అంతు లేనిది. అగమ్యము మహా మేధావులే పరిష్కరించ లేకున్నారు.

భౌతిక వస్తు తత్త్వజ్ఞానులు సాధించిన అభ్యుదయము కేవలము తాత్కాలికమే, పైగా, మానవత్వమును సంకుచిత పఱచి, సంక్షోభము కలుగజేయునట్టిదియే మారణాస్త్రములు (Atom bomb, Nitrogen bomb, Cobait bombs) విష వాయువులు మొదలగు అభ్యుదయ సాధన సామాగ్రి మానవుని యెంతవఱకు ముందునకు తీసికెళ్ళినవి? ప్రపంచ శాంతికి ఆత్మను బలిదానము చేసిన ఏసు, మహాత్ముడు అబ్రహాం లింకన్, మహాత్ముడు సాధించిన ఆత్మ విజయమునకన్న అనువిచ్ఛిత్తి యేమి అంత గొప్పదిగా కనుపట్టదు.

వస్తు అధికోత్పత్తి అభ్యుదయ చిహ్నములని అని విమర్శించవలెను. ఒక వ్యక్తి లేదా కొందఱు స్వస్వ స్వార్థపరులై అధిక ఆహారోత్పత్తిని సాధించి కేంద్రీకరణము చేసి అనుభవించుట అభ్యుదయ మెట్లగును? అమెరికా దేశములో నెక్కువ పంటను సరియైన ధరలేదని కాల్చుటయు, ఓడలను నడి సముద్రమున ముంచుటయు నేటికిని జరుగుచునే యున్నది. ఒక వైపున క్షుద్బాధచే లక్షలాది ప్రజలు అన్నము లేక నశించుచుండిన సమయములో నడి సముద్రమున నిండు ధాన్యపు ఓడను ముంచుటలోగల జీవితతత్త్వము అభ్యుదయము ఎవరికిని బోధ పడదు. నివసించుటకు తావులేక చలి చీమలవలె ప్రజలు బాధపడుచుండ సామ్రాజ్య విస్తరణకు జాత్యభివృద్ధికై అమెరికా దక్షిణాఫ్రికాలలో ఇతర జాతులను మరఫిరంగులతో మారణహోమము చేయుట యందలి జీవిత తత్త్వము, అభ్యుదయము నేటికిని మరెన్నటికిని మనకు బోధ పడదు. పశువులతో సమానముగ నొకరితో నొకరు పోరాడడము. "Might is rght," Survival of the Fittest అను జీవి తత్త్వములు అభ్యుదయమని ఏ నాగరికుడు కూడ అనలేడు. పశువులుకూడ 'నీ, నా' అను భేదభావము లేక సుఖముగానున్నవి. అట్టి పశుతత్త్వమే అభ్యుదయమైతే అట్టిది అవాంఛనీయము. పరమ అసహ్యముగా బహిష్కరించవలసినదే. ధర్మము, అధర్మము, నీతి, అవినీతి దైవము అను భేద భావములు లేక అంతయు తన శక్తియే అని విఱ్ఱవీగెడి జీవిత తత్త్వము ప్రపంచ శాంతికి యెంత మాత్రము

(ఆదర్శ నూతన సాంఘిక వ్యవస్థ బేసిక్ లక్ష్యమై యున్నది.) అందులకు పవిత్రసాధనము బేసిక్ విద్యాసూత్రములు . కనుక బేసిక్ విద్య ఆధ్యాత్మిక దృష్టి కలిగి యుండవలెను.)

మానవుడు శాశ్వతమా? సంఘము శాశ్వతమా? మానవుడు శాశ్వతముకాదు. ఒకడునశించిన మరొకడు జన్మించును. కాని ఎట్టి వారున్నను సంఘము శాశ్వతముగా నుండును. కావున సంఘమునకై మానవుడు పాటుపడుట ధర్మము వ్యక్తులు సంఘలక్ష్యములను సాధించుటకు సాధనములగుదురు. సంఘాభ్యుదయమును సాధించినవారు మహా మహితాత్ములగుదురు. సంఘ పతనము విచ్ఛిన్నము సాధించినవారు ద్రోహులగుదురు; అపవిత్ర సాధనములని చెప్పవచ్చును.

వ్యక్తిత్వమును ఒక నిర్ణీత, నిర్దిష్టమైన క్రమ పద్ధతిలో కాక స్వేచ్ఛగా అభివృద్ధి చెందునట్లు చేసినచో మిక్కిలి స్వార్థ పరత్వమునకు, ధనిక వాదమునకు, దోపిడీ విధానమునకు దారితీయును, అట్లుగాక సంఘ శ్రేయస్సునకు దానిని ఉదాత్త పరచిన యెడల సంఘము నిరంకుశముగా పరివర్తన చెందును. కావున వ్యక్తిత్వమును ( Indivdiuality) అటు స్వేచ్ఛగా విడువరాదు, ఇటు సంఘమునకు బానిసగా చేయరాదు. మరి ఎట్లు రూపొందించిన వ్యక్తికిని, సంఘమునకును అభ్యుదయ మేర్పడును? ఇటువ్యక్తిత్వము నశించరాదు అటు సంఘము విచ్ఛిన్నము కారాదు? అది సమస్య. సర్వ తంత్ర

స్వతంత్ర జీవనము చేయుటవలన వ్యక్తిత్వము నశించక పూర్ణాభివృద్ధి చెందును. స్వాగ్రహిత, స్వచ్ఛంద సేవచేయుట వలన సంఘాభివృద్ధియు జరుగును. కావున బేసిక్ విద్యయందు అటు రెండు పరస్పర విరుద్ధభావములకు సమ్మేళనము చేయ బడినది. మహాత్ముని సాంఘిక వ్యవస్థలో 'నీ' 'నా' అను భేదభావము ఉండదు. None shall call mine or thine (Harijan Sep. 1941) వ్యక్తి స్వామిత్వమునకు Indiudual owner ship) ఒక హద్దు ఉండునని మహాత్ముడు ఘోషించినాడు. వికేంద్రీకృతమైనపరిశ్రమలు Decentralised Industries వికేంద్రీకృతమైన అధికారము (Decentralise power) మహాత్ముని నూతన సాంఘిక వ్యవస్థకు పునాదులు. బేసిక్ విద్యయందు ఈ సూత్రములనే బాలురచే ఆచరింప చేతురు. భారీ పరిశ్రమలకు ప్రజలే భాగస్వాములుగా ప్రభుత్వము ధర్మకర్తగా (Trustee ship)నుండును. Every citizen is a share holder of the industry వ్యవసాయము ప్రధానమైన పరిశ్రమగా తదితరపరిశ్రమలు దాని అనుబంధ పరిశ్రమలుగా నుండును.

ఆధునికులు ఇంద్రియ భోగమే Sense enjoyment పరమలక్ష్యమని భావింతురు.. అదియే అభ్యుదయమని తల పోతురు. ఆధ్యాత్మికులు ఇంద్రియ భోగములు తుచ్ఛమని, బుద్బుదమని, అవాంచనీయమైనవని చూతురు. ఇంద్రియ వాంఛలను ఎవరు కాని తృప్తిపఱచలేరు దినదిన ప్రవర్ధ

యానమై మానవుని పశుతుల్యునిగా మార్చును. సీని సగ కామము, హద్దులుదాటిన అధికారవాంఛ, పరపీడన, భోగ తృష్ణ అతిశయించి ప్రజాస్వామ్యమును కూలద్రోయును. నిరం కుశత్వమునకు దారి తీయును. అట్లుగాక ఆధ్యాత్మిక ప్రసక్తి మానవునిలో సర్వతో ముఖాభివృద్ధి కలిగించును. స్వార్థ రహిత త్యాగము, విశ్వమానవ సౌభ్రాతృత్వము, ప్రపంచ శాంతి ఏర్పడును. అట్టి ప్రసాదములు భేసిక్ విద్య ద్వారా సాధ్యమగును.

గీతావాక్యము:- ధ్యాయతో విషయాన్ పుంసః
సంగస్తేషూప జాయతే ।
సంగాత్సం జాయతే కామః ।
కామాత్క్రోధోభి జాయతే ।
క్రోధాద్భవతి సమ్మోహః ।
సమ్మోహాత్స్మృతి విభ్రమః ।
స్మృతి భ్రంశాద్బుద్ధి నాశః ।
బుద్ధినాశాత్ప్రణశ్యతి. ॥

మహాత్ముడు చేసిన మరొక మహత్తర విప్లవమేమనగా; రాజకీయములలో నైతిక సూత్రములను ప్రవేశపెట్టుట. అట్లు సత్య, అహింస, సత్యాగ్రహము, ప్రాయోపవేశములు ప్రవేశ పెట్టెను. ధనికవాద దోపిడీ విధానాలను అణచివేయ అహిం సాత్మకమైన రాట్నము, కుటీరపరిశ్రమలను ప్రోత్సహించెను.

వికేంద్రీకృత సూత్రమును ఆర్థికరంగమునందు ప్రవేశపెట్టెను. స్వయంపోషకత్వ సూత్రమును Principles :of self sufficiency in Education విద్యాజగత్తునందు ప్రవేశపెట్టి ఊహింపరాని విప్లవము, పరిణామము చూపెను. ఇట్లు సాంఘిక, రాజకీయ ఆర్థిక సూత్రములను విద్యాప్రణాళికయందు నిగిడించి నూతన వర్గరాహిత్యమైన లౌకిక సాంఘిక వ్యవస్థను స్థాపింప ప్రయత్నించెను, సిద్ధాంతములను ఆచరణ పెట్టుటలో సరియైన నాయకులు లేక బేసిక్ విద్య భయముగా కనబడుచున్నది.



# నవభారత నిర్మాణము.

—:O:—

అత్యవసరమునకన్న ఎక్కువైనది, ప్రతిగింజకటి ఆత్మద్రోహము, సంఘద్రోహము, దేశద్రోహము అన్నిటికిని మించిన దైవద్రోహముగా పరిగణించబడును. ప్రకృతిననుసరించి జీవిత తత్త్వ రహస్యము. మితిమీరిన అవసరములు, విదేశ వస్తు వ్యామోహము, దేశ ఆర్థిక పతనమునకు ముఖ్య కారణములు. ఒక నిర్ణీత ప్రణాళిక ననుసరించి ఉత్పత్తి సాధించిన దేశ ఆర్థిక పరిస్థితి తప్పక బాగుపడును. సంపద వికేంద్రీకృతమై ప్రజలహస్తగతము కావలెను. ఇందుకు ముఖ్యమార్గము కుటీర పరిశ్రమల పోషణ. అధికార స్వామ్యము తోపాటు ఆర్థిక సమత్వము, స్వామ్యము సాధించవలెను. అదియే నిజమైన స్వారాజ్యము. నాగరికత. పాశ్చాత్య దేశములలో జరిగిన జరుగుచున్న పారిశ్రామిక విప్లవములను మనము శ్రద్ధగా పరిశీలించి కొంతవరకు మన మార్గములను సంస్కరించుకొనవలెను. ఉత్పత్తి అధికమై విదేశములలో వర్తకస్థానములు లభించక, తమ దేశములలో సరియైన ధరలు లేక దగ్ధము చేయుచున్నారు. ఓడలలో తీసికెళ్ళి సముద్రములో ముంచి వేస్తున్నారు. కొన్ని దేశములు అన్నమో రామా అంటు-క్షామ పీడితమై నశించుచుండ, పెద్దపెద్ద దేశములు ఆహార ధాన్యములను నాశనము చేయడము నాగరికతయా? మానవత్వమా?

ప్రతి చిన్న విషయమునకు యంత్రములపై ఆధార పడుట పరిపాటు. తనకను వ్యక్తిత్వమును గోల్పోయి బానిసగా మారుచున్నాడు. ఏ కొద్దిమందో ధనికులు, అధికారులు మనలను పరిపాలించుచున్నారు. సంఘము యొక్క నిత్య జీవితావసరముల ఉత్పత్తి వ్యక్తుల చేతులనుండి తప్పించవలెను. అట్లులేనిచో ధనికవాదము అనివార్యమగును. ఆహారము, వస్త్రము, గృహనిర్మాణమునకు సంబంధించిన విషయములను సమాజమే ఉత్పత్తి చేయవలెను. వ్యక్తుల చేతులలో కేంద్రీకరింపబడరాదు, రష్యా దేశములో వలె ప్రభుత్వమే తీసికొన్న నియంతృత్వము తప్పదు. ఇటు ధనిక వాదమునకు, అటు నియంతృత్వమునకు దారి తీయక సుస్థిర ప్రజాస్వామ్యమునకు దోహదము చేయునట్లు ఉత్పత్తిని సాధించవలెను.

ఏ వ్యక్తి కా వ్యక్తి తన జీవితావసరములను సృష్టించుకొన్న అటువంటి చిక్కు రానేరాదు. ప్రతివ్యక్తియు సర్వతంత్రస్వతంత్రుడై యుండిన ఏచిక్కునురాదు. బేసిక్ విద్య ద్వారా అటువంటి పౌరులను తయారుచేయవచ్చును. అట్టి సుశిక్షిత పౌరులుగల నవ భారతము భూతల స్వర్గముగా నుండును. ఇందులో నతిశయోక్తి లేశ మాత్రముకూడ లేదు,

సహకార, ప్రజాస్వామ్య, వికేంద్రీకృత ఆర్థికసిద్ధాంతములు గాంధీజీగారి పవిత్ర ఆశయములు సామాన్యమైన ఒక

చిన్న వస్తువును తయారుచేయు యంత్రము వేయిమంది కార్మికుల జీవనమును నాశనము చేయుచున్నది. వడ్లను మిల్లులో చేయుమర వేలకొలది దంచేవాండ్ల జీవనమును నాశనము చేయుచున్నదో అందరికిని తెలిసిన విషయమే. పైగా మర మిల్లు [illegible] దంపుడు బియ్యమునకు సాటిరానని అందులోని విటమినులు, ఆహారవిలువలు నశించునని శాస్త్రవేత్తలు ఎంతో [illegible] మనయందు యంత్ర వ్యామోహము తగ్గినదా? స్వయముగా [illegible], చేతులారా వినాశనమును ఆహ్వానించు [illegible] ఏమిటో ?

అయితే సంపూర్ణముగా యంత్రములను బహిష్కరింప వలెనా? "Man Vs. Machine" అను గ్రంథమున J. C. Kumarappa గారు మానవునికిని యంత్రములకును ఎట్టి నిష్పత్తి (proportion) ఉండవలెనో వర్ణించినారు. వివరములకు ఆగ్రంథమును చదవండి జీవిత నిత్యావసరములు తప్ప భోగసంపదలను యంత్రములు తయారు చేయవచ్చును. భారీ పరిశ్రమలు Major Industries--Arms-Ammunition, Railways, Aeroplanes, Steamers etc యంత్రములకు అప్పచెప్పినను మనకు గొప్ప నష్టముండదు. కాని ఈ యంత్ర పెను భూతములను ఒక నిర్దిష్ట, నిర్ణీత నిర్మాణాత్మక ప్రణాళిక ననుసరించి నడపకపోయిన దేశ పతనము తప్పదు. భారీ పరిశ్రమలకు ప్రజలే భాగస్వాములుగా నుండవలెను. "Every labourer shall be a Share Holder" ప్రభు

త్వము ధర్మ కర్తృత్వము వహించవలెను. (Trustee ship)

ఇట్లు మహాత్ముని ఆశయముల ననుసరించిన, ఆర్థికముగా వికేంద్రీకృత సిద్ధాంతము, సాంఘికముగా జాతి, మత, వర్ణ, వర్గ, లింగ, విభేదములేని లౌకిక వ్యవస్థయు, రాజకీయముగా ప్రజా స్వామ్యము కలదియు నగు నవ భారత నిర్మాణము జరుగును. ఇందులకు ఇటుకలు, రాళ్లు వలయు ముడి పదార్థము బాలుర, బాలికలు వారిని తగిన విధముగా తీర్చి దిద్దే మహా శిల్పి ఉపాధ్యాయుడు. కనుక ప్రథమమున ఉపాధ్యాయులకు బేసిక్ శిక్షణ అత్యవసరము.

రాజకీయరంగమున అహింస, సత్యాగ్రహము, సాత్త్విక నిరోధము మొదలగు నైతిక, ఆధ్యాత్మిక సాధనములను మహాత్ముడు ప్రయోగించినాడు. ఈ రాజకీయ సూత్రములను విద్యా విధానమునకూడ మేళవించి బేసిక్ విద్యను రూపొందించినాడు. సామ్రాజ్య వాదము, ధనిక వాదము, పరపీడన, దౌర్జన్యము, నిరంకుశత్వమునకు దారితీయు హింసామార్గములు పూర్తిగా త్యజింపబడి బాలబాలికలకు పూర్ణముగా సత్య, అహింసల యందు శిక్షణ యివ్వబడుచున్నది.

ఇట్లు బేసిక్ విద్య 1) రాజకీయముగా ప్రజాస్వామ్యమై 2) ఆర్థికముగా వికేంద్రీకృతమై 3) సాంఘికముగా వర్గ రాహిత్యము, జాతి, మత, విభేదములు లేక లౌకికమై 4) నైతికముగా సత్య, అహింసలు ప్రమాణమై ఆధ్యాత్మికమై అనన్యమై శిశ్వమై వెలయుచున్నది.

# బేసిక్ విద్య—సప్త వర్షకృషి
## (1938—1946)

—— :O: ——

1938 సం॥ మొదలు 1946 వఱకు సయీూతాలీమ్ సంఘము సమర్పించిన నివేదిక సారాంశము, ఈ విధముగా వివరింప బడినది.

పై సంఘము ఆచార్య ఆర్యనాయకంజీ, శ్రీమతి ఆశాదేవి, కాకాసాబ్ కాలేల్కర్, మొదలగు నాయకుల పోషణలో పెరుగుచువచ్చినది. ప్రప్రథమమున గాంధీజీ జూలై 1937 సం॥ హరిజన పత్రికలో బేసిక్ విద్య అను అభిప్రాయ మును బయట పెట్టెను. శిశువునందలి అంతర్గతమైన, విశిష్టమైన శారీరక, మానసిక, నైతిక, ఆధ్యాత్మిక శక్తులను సమగ్ర, సర్వతోముఖాభివృద్ధి చేసి సంపూర్ణమైనమానవత్వమును ప్రసా దించుటయే విద్య యని నిర్వచించెను. "Education is to draw out". కావున అక్షరాస్యతయే విద్య కానేరదు. ప్రతివ్యక్తియు సర్వతంత్ర స్వతంత్ర జీవనము గడుపు సత్పౌ రుడుగా తయారు కావలెను. అదే విద్య యొక్క పరమావధి.

చేతిపనులు యాంత్రికముగా నేర్పరాదు (Mere mechanical way) శాస్త్రీయముగా నేర్పవలెను. (Most

డాక్టర్ జకీర్ హుసేన్ అధ్యక్షులుగా పై వివరించిన ఆశయముల కనుగుణ్యముగా ఒకవిద్యా ప్రణాళికను తయారు చేసిరి. అఖిలభారత కాంగ్రెసు సంఘమువారు తమ హరిపుర సమావేశమున 1938 మార్చిలో పై విద్యా ప్రణాళికను జాతీయ విద్యా ప్రణాళికగా ఆమోదించిరి. కాని మహాత్ముడు సూచించిన 5వ సూత్రమును సవరించలేదు.

1938 ఏప్రిల్ మాసమున నయీ తాలీము సంఘము అని ఒక విద్యా సంఘము సేవాగ్రామమున స్థాపింపబడెను. కొన్ని ప్రత్యేక విద్యా సంస్థలను ప్రయోగశాలలుగా ఏర్పరచిరి. 1939 సం॥ పూనా సమావేశమున మరికొన్ని నిర్ణయములు చేసిరి. 1. మాతృభాష, ఇతరదేశ భాషలు, ఇంగ్లీషు, వలన గొప్ప దెబ్బ తినినందున కనీసము 7 సంవత్సరములు మాతృభాష ద్వారా విద్యాభ్యాసము చేయనిదే ఆంగ్ల భాషను ప్రవేశపెట్టరాదు.

2. నిర్బంధ ఉచిత విద్యను అమలు పరచుటకు వ్యయము కేంద్రప్రభుత్వముకూడ సమానముగా రాష్ట్ర ప్రభుత్వములతో భరించుకొనవలెను.

3. బేసిక్ ట్రయినింగ్ పాఠశాలలయందు పనిచేయు ఉపాధ్యాయులకు అధమ పక్షములో ఒక సంవత్సరము ప్రత్యేక శిక్షణ యివ్వవలెను.

4. గ్రామ జీవన, ఆర్థిక, సాంఘిక సమస్యలను ఉపాధ్యాయులు అవగాహన చేసికొనవలెను.

5. ఉపాధ్యాయులకు, విద్యార్థులకు మంచి కళా నైపుణ్యము వచ్చునట్లు శిక్షణ యివ్వవలెను. (Skill in crafts)

6. విద్యా బోధన సమన్వయ సిద్ధాంతము ద్వారా జరుగవలెను. కేవలము పరిశ్రమలతోనే అస్వాభావిక సమన్వయము బలవంతముచేయక (Pry Force) సాంఘిక, భౌతిక ప్రకృతి వాతావరణములతో సమన్వయము చేయుచుండవలెను.

7. ఆయా ప్రాంతములలో నుండు పరిశ్రమలకు అనుగుణ్యముగా పాఠశాలయందలి పరిశ్రమలను ఎన్నుకొనవలెను.

8. స్థానిక నిత్య జీవితావసరములను మనస్సునందిడుకొని పాఠశాలలోని ఉత్పత్తిని క్రమపఱచవలెను.

9. ప్రత్యేక పర్యవేక్షణకు వీలగునట్లు కొన్ని పాఠశాలలను బేసిక్ యూనిట్ అనిగాని బెల్ట్ అని గాని విభాగించవలెను.

10. నైపుణ్యము వహించిన ప్రత్యేక వృత్తిదారుని (Special craft Supervisor) ను నియమించి పాఠశాలల

యందలి గుణదోషములను నవరించవలెను. ఉపాధ్యాయులకు సలహాలను నిచ్చుచూ ఆ యూనిట్ అంతటా ప్రయాణము చేయవలెను. (Touring Special craft Superviso)

1941 సం॥ ఏప్రెల్, ఢిల్లీలో జమియా నగర్‌లో సమావేశ మద్వితీయ సమావేశము డాక్టరు జకీర్ హుస్సేన్ అధ్యక్షతను బాబూరాజేంద్ర ప్రసాద్‌గారి ప్రారంభోపన్యాసములో ప్రారంభ మాయెను. ఆ నివేదికా సారాంశమిది.

1. ప్రభుత్వముచేతను, స్థానిక సంస్థలచేతను ప్రత్యేక వ్యక్తులచేతను నడపబడుచున్న బేసిక్ పాఠశాలలయందలి బాల బాలికల శారీరక మానసిక, నైతిక అభివృద్ధిని గురించి ఈ సమావేశము గర్వించుచున్నాము.

2. బాల బాలిక యందలి నవచైతన్యము, ఆత్మవిశ్వాసము, సర్వతంత్ర స్వతంత్రతా నిశిత, నిష్కష్ట ప్రకటన, సహకార సంఘీభావము స్పర్థ, ఈర్ష్య, మూఢత్వము నశించి, విశాల హృదయ భావము శాంతి, సహనములు అభివృద్ధి యగుటచూచి ఈ సమావేశము వారు గర్వించు చున్నారు.

3. 1941–42 సం. బేసిక్ విద్య ఎక్కువగను వ్యాప్తి జెందలేదు. బీహార్, బొంబాయి, మధ్య ప్రదేశ్, సంయుక్త రాష్ట్రములు, కాశ్మీర్, జమియా మిలియా యిస్లామియా (ఢిల్లీ) పూనాలోని తిలక్ మహా రాష్ట్ర విద్యా పీఠములోను నిర్ణీత

ప్రకారము ప్రయోగములను సాగించిరి. హిందూస్థానీ తాలీమీ సంఘమువారు ఒరిస్సాలో 7 పాఠశాలలు, సేవా గ్రామములో ఒక పాఠశాలయు నిర్వహించిరి. వారు విశద పరచిన ప్రయోగ ఫలితములు.

1. పరిశ్రమలయందు సమర్థత, నైపుణ్యత చాల వఱకు సిద్ధించినది.

2. కృత్యము ద్వారా ఏర్పడిన క్రమశిక్షణ విధింప బడిన క్రమశిక్షణగాక ఆచరణ యోగ్యమైన ఆత్మశిక్షణగా మారుచున్నది.

3. పరిశ్రమ యందలి నైపుణ్యముతో పాటు (Skill) బాలునికి బుద్ధికుశలత, చుఱుకుతనము, సదభ్యాసములుకూడ నలవడుచున్నవి.

4. బేసిక్ పాఠశాలను తదితర పాఠశాలలతో పోల్చి చూచిన హస్తిమశకాంతర భేదముండును. ఏ పనినైనను క్రమ బద్ధముగను సంపూర్ణముగను స్వేచ్ఛగను చేయుచున్నారు.

5. బాలురయందు కౌతుకము, జిజ్ఞాస, నిశితపరిశీలన నిర్దుష్ట భావ ప్రకటన, నిష్పాక్షిక శాస్త్రీయ దృక్పథము నేర్పడినది.

6. బాలబాలికలు సాంఘిక, భౌతిక, పరిసర వాతావరణముల కనుగుణ్యముగా ప్రవర్తించుచున్నారు.

7. సహకార, సంఘీభావము, స్వార్థత్యాగము సేవ మొదలగు మహోత్కృష్ట ఆదర్శములకై పాటుపడుచున్నారు.

8. స్వీయ, పరిసర పారిశుద్ధ్యమునకై నిరంతర కృషి చేయుచున్నారు.

9. క్రమశిక్షణ నిర్బంధముగా పైనుండి విధింపబడునదిగాక, బుద్ధిపూర్వకముగా, హృదయ పూర్వకముగా దాని విలువను గుర్తించి, చెడ్డను గ్రహించి బాలురు సుశిక్షితులగుచున్నారు.

10. బాలబాలికలు తమయందంతర్గతమైన శారీరక, మానసిక, నైతిక, శక్తులను అభివ్యక్తపఱచుకొని సమగ్ర సర్వతోముఖాభివృద్ధి గాంచుచున్నారు.

# బేసిక్ విద్య - సర్వోదయము.

—:O:—

ఈ సృష్టి ఒక మహా విశ్వవిద్యాలయము. కర్మాచరణము వలనను, జ్ఞాన, భక్తి యోగముల వలనను త్రివిధము లైన ఇచ్ఛా జ్ఞాన ఉత్సాహశక్తులను పూర్ణత్వము నొందించు కొనవలయును. ఇదియే గీతారహస్యము, భారతీయ విజ్ఞానము

నిష్కామ సేవ, ప్రతిఫలాపేక్ష రహిత త్యాగము చేయుటయే నిజమైన ధర్మము, విద్య, నాగరికత ఫలం కోరకుండా వ్యవసాయముచేసిన పంట ఎక్కువగా పండునా? అని ఒక రైతు అడిగితే ఏమి జవాబు చెప్పవలెను? నిష్కామ కర్మవలన కర్తకు ఫలము లేదని నిరాశపడరాదు. తనకు ఫలము లేకున్నను తనవలన వెయ్యారు ప్రజలు లాభముపొందుట ఫలితము కాదా.

" ఉదార చరితానాంతు వసుధైవ కుటుంబకమ్ " అని మహర్షుల ఉపదేశములు. ఈ ఏక కుటుంబభావము కలిగినచో ప్రతిఫలం కోరుట అంటూ ఉండదు. తల్లి, తండ్రి బిడ్డలకై ఎట్లు పాటుపడుదురు? ప్రతిఫలమాసించి బిడ్డలనుపోషింతురా?

ప్రహ్లాదుడు, వ్యాసుడు, శ్రీరాముడు, బుద్ధుడు, అవలోకితేశ్వరుడు, ఏసు, అబ్రహామ్ గాంధీజీ మున్నగు మహా

తమ్ములుపదేశించిన సిద్ధాంతములు ఏమి? సేవ, త్యాగము, మానవ కల్యాణము చాటుటలేదా?

సత్యాహింసలు మన రాజ్యాంగ మూల సూత్రములు. ధర్మము మనరాజముద్ర. "యమాకి యగారాత విక యిరా అన్నం బహుకుర్వీత" అని వేదము చాటుచున్నది. ప్రతివారును ఆహార, వస్త్రముల విషయములో సర్వస్వాతంత్ర్యములు కలిగి యుండ వలెను. ప్రతివారును చేతనయినవిధంగా సంపాదించవలయును. ఎక్కువైనది సంఘమునకు అంకితముచేయువలెను. ధనమనగా వెండి, బంగారు, రత్నములు కానేరవు. అన్నమే పదార్థం, పశువులే ధనం, ఇంగ్లీషులో ధనం అనగా పశువులు అని అర్థమున్నదట. "అన్నం పరబ్రహ్మ స్వరూపమని" పెద్దలు నుడివిరి. కావున ప్రతివారును ఆహార, వస్త్రగృహ కొరత లేక మనిననాడే సర్వోదయము సిద్ధించినదని చెప్పవచ్చును. అట్టి సర్వోదయ సాధనకు బేసిక్ విద్య రాజమార్గముగా వెలయుచున్నది.

ఆచార్య వినోబా భావేగారు ప్రవేశపెట్టిన భూదానము, శ్రమదానము, జీవనదానము అను యజ్ఞములు గొప్ప అహింసాత్మక విప్లవములు. సంఘము తాదుమారై సర్వోదయము సిద్ధించును.

"One world Theory" "ఏక కుటుంబ సిద్ధాంతము" సర్వోదయ లక్ష్యము.

ఒకనాడు భావేగారు ప్రార్థన సమావేశమున ఇట్లు బోధించిరి. ‹‹ కానా, పీనా, సోనా, ఏహీహై జీవిత్ కా మతలబ్ హైతో, జాన్ వార్ భీ జీతే హై'' అనగా తినడము, త్రాగడము నిద్రపోవడము జీవితమునకు అర్థము అయితే జంతువులు కూడ జీవించుచున్నవి. మనము బజారులో పోవునపుడు మన ప్రక్కన పోవు గుఱ్ఱములను, పశువులను చూచి ‹‹ హామ్ ఉనుసే కైసే జాహతర్ హై '' మీకన్న మేము ఏమిగొప్ప? అని ప్రశ్నించుకొన్న మన ఘనత అర్థమగును, పశుపక్ష్యాదులకన్నా మానవుని శ్రేష్ఠత ఏమిటి ? సహకారము, పరోపకారము, స్వార్థరహితము— ధర్మజీవనము ఒకటే.

కావున విద్యయనగా పశుత్వమును నశింపజేసి మనలో మానవత్వమును ఆపాదించునదని నిర్వచింపవలెను. అక్షరాస్యత విద్యకాదు. ముద్రణాయంత్రములు వచ్చి 300 ఏండ్లయినది. అక్షర జ్ఞానముకలిగి 3000 ఏండ్లయినది. సృష్టి ప్రారంభమై 7 లక్షల ఏండ్లయినదని చరిత్రకారులు చెప్పుచున్నారు. కావున పూర్వులు అక్షరాస్యులుకారు. కాని గొప్ప విద్యావంతులు, 'విద్' అనగా తెలిసికొనుట. ఏదైనా సరే తెలిసికొనుట విద్య 'స్ర' అనగా ప్రవహించునది. సరస్వతికి సంబంధించినది- సారస్వతము. విద్యదానిలో ఒక భాగము, ఎడతెగకుండ ఒకరినుండి ఒకరికి అనుభవములు ప్రసారమైనవి. అన్నిటికన్న మిన్నగా మనకువచ్చిన నైతిక ఆధ్యాత్మిక వారసత్వము

గొప్పది. భారతములో "కన్ను విద్య-సత్యం తపః" అని వర్ణించినారు.

ఇప్పుడు సర్వతంత్ర స్వతంత్ర, స్వయంపోషక, స్వావలంబన, సహకార, స్వచ్ఛంద పవిత్రజీవనమును పొందుట విద్య. అదియే సర్వోదయము. "యశోవా మృత్యుర్వా"

---

## కుటీరపరిశ్రమలు

—:O:—

మీరు 'టారీఫ్' లను పేరు వినియుందురు. పరదేశాలలో మనము వస్తువులను కొన్నప్పుడు లేదా విదేశీవస్తువులను మనదేశములో కొన్నప్పుడు మనమిచ్చు ద్రవ్యము పరాయి వారికి పోవును. మనదేశములో తయారైన వస్తువులను కొన్నప్పుడు ద్రవ్యము మనవారికి పోవును. పైగా వస్తువులు ద్రవ్యము మన దేశములోనే ఉండిపోవును.

పై మాటలు అబ్రహామ్‌లింకన్ తన దేశీయులను గూర్చి చెప్పినాడు.

మనదేశ ప్రజానీకములో అధిక సంఖ్య వ్యవసాయముపై ఆధారపడియుందురు. కనుక సంవత్సరములో ఏ కొద్ది

మాత్రమే వాడుట. (10) తకిలీని సమరేఖయందుండునట్లు నూలువడకి ఎడమచేతిని ఎడమకు వాల్చుట. (11) తకిలీని నేలకు ఆన్చి వడకుట. (12) మౌనముగా నుండుట.

అర్ధగంటకు తకిలీ వేగము:—

నేటివరకు యెక్కువ వేగము ఈక్రింది విధముగ నున్నది.

| పురుషులు | | | స్త్రీలు | | |
|---|---|---|---|---|---|
| వయస్సు | పోగులు | నెంబరు | వయస్సు | పోగులు | నెంబరు |
| 8 | 78 | 12 | 8 | 77 | 12 |
| 16 | 202 | 12 | 12 | 130 | 12 |
| 19 | 223 | $11\frac{3}{4}$ | 17 | 187 | 20 |
| 21 | 206 | 19 | 19 | 178 | 16 |
| 33 | 149 | 13 | 28 | 130 | 14 |
| 65 | 135 | 14 | | | |

మానకుంఁడ ౫, 6 గంటలలో వడికిన అత్యధిక వేగము ఈ క్రింది విధముగ వచ్చెను

| పురుషులు | | | | స్త్రీలు | | | |
|---|---|---|---|---|---|---|---|
| వయస్సు | చుట్లు | నెంబరు | కాలము | వయస్సు | చుట్లు | నెంబరు | కాలము |
| 15 | 1326 | 12 | 5-25 | 25 | 1005 | 10 | 5-33 |
| 13 | 1210 | 10 | 5- 0 | 26 | 1323 | 10 | 5-45 |
| 18 | 1160 | 11½ | 5-33 | 29 | 1256 | 14¼ | 5-0 |
| 19 | 1632 | 9 | 5-20 | 64 | 1005 | 11 | 5-40 |
| 19 | 1236 | 11½ | 4-44 | | | | |
| 19 | 1022 | 11 | 5-36 | | | | |
| 21 | 1231 | 10 | 5-30 | | | | |
| 22 | 720 | 13¼ | 2- 0 | | | | |
| 22 | 1290 | 14½ | 4-40 | | | | |

కుడి చేతితో వడకుట:—

ఎడమ చేతితో ఏకును పట్టుకొని కుడి చేతితో తకిలీని త్రిప్పుటయని యర్థము — కుడి చేతితో ఏకును పట్టుకొని ఎడమ చేతితో తకిలీని త్రిప్పుచు వడకుటను ఎడమ చేతితో వడకుట యందురు — ఇంతవరకు చెప్పిన విషయములన్నియు కుడి చేతితో వడకుటకు సంబంధినవి — ఎడమ చేతితో వడకునపుడు కూడ ఆ విషయములనే గమనించవలెను. కుడి చేతితో తకిలీని సవ్యముగ త్రిప్పుదుము — తిరుగలిని ఏ చేతితో త్రిప్పినను తకిలీ ఒకే వైపునకు తిరుగునట్లు చూడవలెను. నిజముగ వ్యాయామము శరీర నిర్మాణము ననుసరించి ఎడమ చేతితో అపై దక్షిణముగ త్రిప్పుట సహజము — కాని క్రింద నుదహరించిన లాభనష్టముల కారణముగ సవ్యముగానే తిరుగు చున్నట్లు చూడవలెను. రెండు చేతులతోను ఒకేదిశకు త్రిప్పుటచే నూలునకు వేరువేరు పురులు కలుగవు. రెండు చేతులతోను ఒకే తకిలీపై నూలు దీయవచ్చును వేరు వేరు తకిలీలుంచ నక్కరలేదు. ఒకే లపేటాకు నూలు చుట్టవచ్చును కాని నూలు ఒకే నెంబరు కలదిగ్గా యుండవలెను. కుడి చేతితో తకిలీకి నూలు చుట్టునపుడు బొటనవ్రేలుపై చూపుడువ్రేలు రాయుచు తకిలీని త్రిప్పవలెను. ఎడమ చేతితో చుట్టినపుడు మధ్య బొటనవ్రేలురాయుచు చుట్టవలెను. మధ్యవ్రేలుకు బదులు చూపుడువ్రేలు నుపయోగించవచ్చును. కాని బొటన వ్రేలుకు చూపుడువ్రేలు దగ్గరగ నుండుటచే నెక్కువ

యుపయోగకరముగాదు. క్రొత్తగ నేర్చుకొనువారు రెండు చేతులతోనుగూడ వడకుట నేర్చుకొనవలెను. అనగా ప్రతి పావుగంటకు, అరగంటకు చేయిమార్చి వడకుచుండవలెను. ఒకచేతిని ఎల్లప్పుడు పైకి ఎత్తి యుంచుటచే ఆచేయి అలసి పోవును. అందువలన చేతులుమార్చుటచే విశ్రాంతిగ వడుక వచ్చును. ఎక్కువకాలము 4, 5 గంటలు వరుసగ వడుకవలసి వచ్చిన రెండుచేతులతో వడకితీరవలయును. చేతులుమార్చు టచే వాటికి విశ్రాంతి కలుగును. వేగము వృద్ధియగును. ఎడమచేతితో పురిపెట్టుటలో వ్రేళ్ళచివరభాగమందు మొదలు పెట్టి తొడపైగాని మోకాలిపైగాని వడకుచు మణికట్టుపై రాగానే పూర్తి చేయవలయును. రెండుచేతులు సమానముగ నుపయోగించుచు రెండుచేతులకు సమమగు శిక్షణనిచ్చుట మంచిది.

సన్నని నూలు వడకుట:-

1నుండి 20 నెంబరు వరకు నూలుముతకయనియు, 21 నుండి 40వరకు మధ్యదశమనియు, తర్వాత 500 వరకు మిక్కిలి సన్నని నూలనియ తెలుకొనవలయును — సన్నని నూలు వడకుటకు తకిలీ తేలికగ నుండవలెను వెదురు పుల్లల దండె తోచేసిన తకిలీ మిక్కిలి శ్రేష్టము — సన్ననినూలు వడకు తకిలీకి కొక్కెము యుండదు - ఆంధ్రమనాయి పద్ధతి ననుస రించి పింజలు విడదీసి ఏకులు తయారుచేయవలెను — కాని 40

నుండి 80 వరకు నూలు వడుకుటకు 'నాంపేట్' పద్ధతి ననుసరించి తయారు చేసిన యేకుల నుపయోగించవచ్చును.

తకిలీని క్రింద అన్ని వ్రేళ్ళతో త్రిప్పుచుండవలెను. వడకునపుడు చిటికెలను నూలుపై తీసుకొని రాక తకిలీ దండి పైననే యుంచవలెను.

వడకుటలోని వివిధ పద్ధతులు:—

వడకుటలోని సౌకర్యమునకు శరీరముయొక్క వివిధావయవములను, ఎడమ, కుడి చేతులను అనేక విధములుగ నుపయోగించవచ్చును.

(1) పురిపెట్టుట:—

(ఎ) వ్రేళ్లపై (బి) తొడపై (సి) పిక్కపై (డి) అరికాలుపై

వ్రేళ్ళపై పురిపెట్టుటకు రెండు పద్ధతులుగలవు.

(2) కుడిచేతి ఉంగరపు వ్రేలు లేక మధ్య వ్రేలుతో, బొటన వ్రేలుపై పురిపెట్టుట

(3) ఎడమచేయి బొటన వ్రేలుతో ఉంగరపు వ్రేలు లేక మధ్య వ్రేలితో పురి పెట్టుట— మిగిలిన పద్ధతులయందు అరచేయి యుపయోగించబడును.

# రాట్నము.

—:0:—

పూర్వపు రాట్నముయొక్క-ప్రధాన చక్రముయొక్క వ్యాసము 22'' లుండును — ఇందు ప్రధానచక్రము కదురునందలి దిండుతో ఒకమాలచే కలుపబడియుండును — ఇంత పెద్ద చక్రమును త్రిప్పుటకు యెక్కువశక్తిని వినియోగించవలసి యున్నది — అందుచే యెరవాడ రాట్నమందు ఎక్కువ యంత్రి లాభముండుటకుగాను పెద్ద చక్రమునకు కదురునందలి దిండునకు మధ్యయొక వడిచక్రము తిరుగు చక్రముకూడ నిలబడునట్లు అమర్చబడియున్నది.

తరువాత కిసాన్ రాట్నము తయారు చేయబడియున్నది. ఇందు ప్రధానచక్రము వడిచక్రము తిరుగు చక్రము పరుండబెట్టియుండును. పెద్దచక్రము వడిచక్రముతో కలుపబడి యుండును. తిరుగు చక్రము కదురునందలి దిండుతో కలుపబడియుండును. యరవాడ రాట్నమందలి వడిచక్రమువలెగాక, కజ్జాతో చేయబడియుండక, కిసాన్ రాట్నమందు వడిచక్రము టక్కుతో చేయబడియుండును. ఈ రాట్నమునే మనవెంట యథేచ్ఛముగ సులువుగ తీసుకొని పోవుటకుగాను ఒక పెట్టియందు అమర్చబడియున్నది. - దీనిని పెట్టెరాట్నమందురు.

గేర్ రేషియో 120 యుండును అనగా పెట్టెరాట్నమందలి యంత్రిలాభము 120-పెద్ద చక్రిముయొక్క అక్షము, వడిచక్రిము యొక్క అక్షము దిండుయొక్క అక్షము లయొక్క మధ్యబిందువులను కలపిన యెడల ఈ బిందువులన్నియు ఒక త్రిభుజముయొక్క కొనలై యుండవలెను - ఇవి యన్నియు నొకే సమరేఖలో నుండరాదు — ఇవన్నియు నొకే సమరేఖలోనున్నయెడల దిండు నిలువు పీటయొక్క గాడెలో ప్రక్కలకు తగులకుండ తిరుగును - అందుచే రాపిడి యుండదు - గాన అవియొక త్రిభుజాకారములో నున్నయెడల పెద్ద చక్రమును త్రిప్పుటకు తక్కువ శక్తి వినియోగించుటకు వీలగును.

కదురు పొడవు 7'' లుండును- ఇందలి గుండ్రని చక్కీ లేక బిళ్ల ( Disc ) కదురుయొక్క సూదికొననుండి 3 1/2'' ల దూరములో నమర్చవలెను- కాని 3 3/4'' లేక 4'' ల దూరములో నుంచిన సన్నని దారము తీయవచ్చును- కదురుయొక్క కొన చాల పదునుగ యుండరాదు- కదురుయొక్క దిండునందలి గాడి 'U' ఆకారములో నుండక 'V' ఆకారములో నుండవలెను. 'U' ఆకారములోనుండు గాడెలో చోటామాల పూర్తిగా ఆని రాపిడియెక్కువ కలుగును- అచటనుండి కొనలు పోను పోను కొనలు వెడల్పు అంతగా యుండక ముడివచ్చునపుడు అందుచిక్కుకొని ఎక్కువ రాపిడిచేవడి తగుల్కు చోటామాల త్వరగ అరిగిపోవుట, తెగి

పోవుటగాని కదురు గరుకుగ నున్నయెడల యినుక కాశి తయితో నున్నునుపుచేయుము. లేకపోయిన క్రొత్త చెవు లుప యోగించవలెను.

చోటామాల.—

... తో పోగులు చక్కగ పురిపెట్టబడి 16 నుండి 18 వరకు నెంబరు ... రమును పేని చివరగా ఒక ముడిచేకలిపి చోటామాలను తయారు చేయవచ్చును. చోటామాల యెంత మన్నితముగ నున్న వడకు ... రమంత నున్నితముగనుండును. గాని తిరుగు చక్రమునుండి తిరుగులవలన గలిగెడి లాగెడిశక్తి (...)కలిగియుండవలెను. ... మాత్రము చోటామాలను తయారుచేయుట కుపయోగింపరాదు. ఏలనన ( ... ) వందలి పిండిలేణువు లూడిపోవుచు వడితగ్గును. మరియు మోడియా' చాలసార్లు సద్దుకొనవచ్చును. కొద్ది మైనము రుద్ది మాలనుపయోగించిన చాల కాలము అనగా 6, 7 చిలపల వరకు నుపయోగింపవచ్చును. కాని మైనము నుపయోగించుట అంత మంచిదికాదు-ఏల ...

చోటామాల తెగుటకు కారణములు:—

i వాతావరణ యుష్ణోగ్రత యెక్కువగానుండుట.

ii పురి యెక్కువైనను, తక్కువైనను

iii దిండుయొక్క చోటమాల తిరుగు ఉపరిభాగము గరుకుగానుండుట.

iv మోడియాయొక్క స్ప్రింగ్ తప్పు [illegible] గరుకుగా నుండుట

v దిండునందలి గాడియొక్కయు, తిరుగు [illegible] నందలి గాడియొక్కయు ఎత్తు [illegible] లేకుండుట.

నోటు:— వేసవిలో చోటాామాలను తడిపి యుపయోగించవలెను. 'U' ఆకారముగల దిండు కంటె '[illegible]' ఆకారము దిండుగల కదురుల నుపయోగింపవలెను

జడామాల:—

బలముగను దళసరిగను నుండవలెను. దీనిని గుండ్రని లైటు వత్తితోగాని, జనుపనారతో తయారు చేయబడిన త్రాడుతోగాని, లేక మెత్తని గుండ్రనితోలుతోగాని, తయారు చేయవచ్చును. ముడిరానీయరాదు. కొనలు కలు[illegible]నపుడు ముడిలేకుండ జాగ్రత్తగ కోసి కట్టవలెను.

Oiling:—

రెండు చక్రములయొక్క యిరుసులు కదురునకు చేయబడిన మోడియా యందలిగాడి తోలుచెవులు నుపయోగించు రంధ్రములలో వేయవలెను. వడిచక్రమునకు చేర్చబడిన స్ప్రింగు మోడియాకు చేర్చబడిన స్ప్రింగు మరియు అప్పుడప్పుడు పెద్ద చక్రము, పిడినందలి యిరుసు, మరియు 'మోడియా' బిగించుట కుపయోగించు మరలు.

నడుకుంట:

కుడిచేతితో పెద్దచక్రమును ప్రదక్షిణముగా త్రిప్పుము. దారము తీయు వాని ఆవలవైపునుండి చోటామాల దిండు కిందుగా త్రిప్పు చక్రముయొక్క ఆవలివైపుకు నుండునట్లు చూడవలెను. ఇట్లుచేసి పెద్దచక్రమును ప్రదక్షిణముగ త్రిప్పిన కదురునందలి దారమునకు త్రిప్పని దారమువచ్చును.

దారము తీయునప్పుడు వాడియైన కొననుండి 10″ నుండి 14″ వరకు దారమును వదలి దారమును తీయుచుండవలెను. దారము ఎక్కువ పొడువుగ తీయుటకు ప్రయత్నింపరాదు. క్రొత్తగా వడకిన దారము 14″ మొదలు 18″లు వరకు మాత్రమే యుండవలెను. ఎక్కువ పురిసేయకుము. రాట్నముపై దారము తీయుట మొదలిడినపుడు ఏకుయొక్క కొన కదురుయొక్క చివర కొద్దిగా త్రిప్పి నెమ్మదిగా కొద్దిపురినిచ్చి ఏకునుండి కొద్దిపురి తిరిగి యిచ్చి దారమును నెమ్మదిగా యొక అరడుగువరకు వచ్చినట్లుచూచి తరువాత త్వరగ వడకవలెను. దారమును కదురునకు పోయునపుడు కదురు బిళ్ల నుండి కొనవరకు శంఖ్వాకారమువలె పోయవలెను. ఇట్లు పోసినచో దారము సన్నముగను, ఆసునకు సులువుగ నెక్కించుటకు వీలుగ నుండవలెను. కొననుండి 1″ లోపు 2″ వరకుమాత్రమే దారముండునట్లు పోయవలెను. కదురుయొక్క బరువు ఎక్కువైన యెడల వడిగా తిరుగదు అందుచే కదురును మార్చవలెను. గాని ఎక్కువగ దారము పోయరాదు.

బొమ్మచెక్క లేక (Modia):—

పీట (Base) $7\frac{1}{2}'' \times 2'' \times \frac{1}{2}''$

నిలువుపీట:—

$2\frac{3}{4}'' \times 2\frac{1}{2}'' \times \frac{1}{2}''$

కదురు వాడు లేక కప్పి తిరుగు గాడి కొలతలు:—

$1\frac{3}{4}'' \times \frac{1}{2}''$

కదురు తిరుగు బొమ్మచెక్కలోని గాడి:—

$3/16'' \times 3/16''$

గాడియొక్క కోణము:—

$10^{\circ}$ to $30^{\circ}$ సామాన్యముగ $25^{\circ}$

అడుగుపీటపైని సీల ఎత్తు:—

1"

ఆనుబల్ల:—

ఎత్తు అనగా రాట్నము పెట్టెలో దారము వెళ్లుటకు ఒక కర్ర కొక్కెముండును. దాని ఎత్తు కొలతలు $5'' \times \frac{1}{2}'' \times \frac{1}{4}''$

ఆనుకొలతలు:—

ప్రతిపలక $17'' \times 1'' \times \frac{3}{4}''$

ఆనుకొమ్ములు:—

3"

కదురు:—

7" to $7\frac{1}{2}''$

వ్యాసము:—

$\frac{1}{8}''$

కదురు దాడి వెడల్పు:—

3/16"

వెలుపలి వ్యాసము:—

7/16"

లోపలి వ్యాసము:—

¼"

గాడిలోతు:—

3/32"

కదురు బిళ్ల వ్యాసము:— 1"

పెట్టె రాట్నము కొలతలు:—

పెట్టె మూయబడి యున్నపుడు:

పెట్టె మూయబడి యున్నపుడు:— 16" x 9" x 3½"

పెట్టె తెరువబడియున్నపుడు:— 32" x 9" x 1¾"

పెద్దమాల చుట్టుకొలత:—

32" లావు ¼"

చిన్నమాల చుట్టుకొలత తిరుగు చక్రము యొక్క వ్యాసమునుబట్టి మారును.

లావు 1/16

పెట్టెరాట్నము యొక్క తూకము 2½ శే||

కిసాన్ చరఖా తూకము 70 తు||

చరఖాతో వడకునపుడు కలుగు ఆటంకములు:—

(ఎ) స్ప్రింగ్సు సున్నగా లేక పోవుట (బి) మాలలు చిన్నవగుట లేక పెద్దవగుట

(సి) సరిగా నూనెతో తడుపకపోవుట (డి) గాడిలో కదురు దాడు సరిగా మధ్య లేక ప్రక్కకు పోచుకొను చుంకుట.

(ఇ) కదురుబిళ్ల Slant గా లేక పోవుట

(యుఫ్) కదురు10° to 30° వంగియుండక పోవుట.

2. మాలలు, దారము జారిపోవుట:— కారణములు.

(ఎ) కదురుకొన సరిగా తేలియుండక పోవుట

(బి) దారమును కదురుకొనకు సరిగా పోయుపనను.

(సి) మాలలు బదులగుటచే దాడిలోనుండి కదురు జారిపోవును.

(డి) దారమును తీయు కోణమును ఎక్కువ చేయుట వలన

దారము తెగుట కారణములు:—

(a) దారములో పురిలేకపోవుట, పురి యెక్కువగుట

(b) రెండుచేతులు కలయికలో సహకారము లేకపోవుట

(c) ఏకులు మంచివి కాకపోవుట. (ఘట్టిచెత్తయు నుండ రాదు. తులమునకు 12 మొదలు 16 ఏకులువరకు తయారు చేయవలెను. దూది చక్కగా ఎక్కువగాకుండ, తక్కువ గాకుండ ఏకబడియుండవలెను.

(f) కదురుకొన వాడిగ నిదానముగ నుండక వంగియుం డుట లేక ఎక్కువ వదునుగానుండుట, లేక మొద్దుబారి యుండుట.

( ) చోదనాలయొక్క ముడి పెద్దదిగా నుండుటచే కదురు ఎగురుచు కదలుచుండుట.

(i) నాణావరణ యుష్ణోగ్రతలు ఎక్కువగానుండుట

(j) ఒకరకం దూదినుండి తీయదగిన నంబరు నూలుకంటె ఎక్కువతీయుటకు ప్రయత్నించుట

(h) కదురు చివరనుండి ఒక అడుగు దారము విడిచిపెట్ట వలెను.

తీసిన దారము ఆసుకు చుట్టుట:—

దారముతీయుట మానివేయగనే రెండుమూలలు తీసివేయ వలెను. ఆసు లిరుగు చక్రముపై యిరుసునందుంచి, నీవు పాద ములపై కూర్చొని కదురును కాలియొక్క బొటనవ్రేలు ఆ ప్రక్క వ్రేలి మధ్యనుంచుము. దారముయొక్క కొసను కొద్ది వదలుచేసి అ తనుముందు ఆసునందున్న దారమునకు కలపి గాని, లేకపోయిన వదలుచేయ నక్కరలేకనే ఆసుయొక్క కొమ్ములచుట్టును వచ్చునట్లు ప్రదక్షిణ మారమున త్రిప్పుచు దారమును పోయుము. ఇట్లు దారముపోయుటలో నీ ఎడమ చేతి బొటనవ్రేలు చూపుడువ్రేలు రాట్నమునందలి కొక్కె

మునకు దారముతో గల కదురునకును మధ్యనుండి దారము చుట్టవలెను. ఇట్లు చేయుటలో నీవు తీసిన దారమంతు ఎట్టి చిన్న నలుసులున్నను ఆ వ్రేళ్ల మధ్య చిక్కుకొని ఊడిపోయి మంచిదారము మాత్రమే ఆనునకు పోవును.

ఆనును నీ కుడిచేతితో వడిగా త్రిప్పవలెను. కదురు నందలి దారము దానంతటది విడి ఆనున చిక్కుచుండును. ఆనునకు దారము చుట్టునపుడు దారము ఏమియు మడతలు పడకుండ చూడవలెను. బిగువుగ చుట్టవలెను.

మిల్లుదారము:—

పోగు పొడవు 4 ' 80 పోగులు 1పి అందురు.(120 X॥)
7 పీలు — 1 బలము (840 X॥)

<u>Strength of yarn:-</u> (దారముయొక్క బలము)

ఒకే చిలపనందలి సమాన నెంబరుగల బలమును లెక్క కట్టునపుడు 6పోగులు (చుట్లు) దారమును వ్రేలాడదీసి చివర ఆరుపోగులు (చుట్లు) తెగిపోకుండ ఎంతబరువు నాపగలదో చూడవలెను. ఆశక్తినిబట్టి ఆ నెంబరుగల చిలప ఎంత శాతము బలముగలదో లెక్క కట్టవచ్చును.

ఇప్పుడు దారముయొక్క అసమానత్వము = d/a

దారముయొక్క అసమానత్వ శాతము = d/a × 100

∵ దారముయొక్క count లోని సమానత్వము =

$$100 - \frac{1000}{a}$$

ఇదే విధముగ బలములోని సమానత్వమునుకూడ కను గొనవచ్చును

$$100 \times \frac{\text{అత్యధిక అల్పతమ బలముల భేదము}}{\text{సరాసరి బలము}}$$

∵ దారమునందలి బలముయొక్క అసమానత్వము

Disuniformity of strength of yarn)

దారమునందలి బలముయొక్క సమానత్వము (uniformity)

Streght of yarn = 100 — Disuniformity

# బేసిక్ విద్య — ప్రార్థన గేయములు

—:0:—

కళ్యాణిరాగం రూపకం

జయ జయ జయ ప్రియభారత
జనయిత్రీ దివ్యధాత్రి
జయ జయ జయ శతసహస్ర నరనారీ హృదయ నేత్రి ॥జ॥
జయ జయ సు మల సుశ్యామ చలా చేలాంచల
జయవసంత కుసుమ లతాలిత భూర్గకుంతల
జయ మదీయ హృదయాశయ, లాక్షారుణ, పదయుగళా
జయ దిశాంత గత శకుంత, దివ్యగాన పరితోషణ
జయ గాయక వైతాళిక గళ విశాల పథ విహరణ
జయ మదీయ మధుర గేయ చుంబిత సుందర చరణా ॥జ॥

1. ఈశా వాస్య మిదెం సర్వం
యత్కించి జ్జగత్యాం జగత్
తేనత్వ క్తే నభుం జీదా
మా కృధఃకశ్చి బద్ధనం

2. నతేన హరి యో హరోతి
యేన పాణాని హింసతి
అహింసా సర్వ ప్రాణానాం
అరియోతి పవుచ్ఛతి

2. విపదో నైవ విపదః
సంపదో నైవ సంపదః
విపద్విస్మరణం విష్ణు
సంపన్నారాయణ స్మృతిః—

1. ఇందు గలడందు లేడను
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే కలడు దానవాగ్రణి వింటే

2. చేతులారంగ శివుని పూజింపడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువడేని
దయయు సత్యంబు లోనుగా దలపడేని
కలుగనేటికి తల్లుల కడుపు చేటు.

3. రఘుపతి రాఘవ రాజారామ్
పతీతపావన సీతారామ్
ఈశ్వర్ అల్లా తేరేనామ్—సబకో సన్మతి దే

జన గణ మన అధినాయక జయహే —
భారత భాగ్యవిధాతా
పంజాబసింధు గుజరాత మరాఠా,
ద్రావిడ ఉత్కలవంగ
వింధ్య హిమాచల యమునా గంగా—
ఉచ్ఛల జలధితరంగ

తవ శుభ నామే జాగే

తవ శుభ ఆశీష మాగే

గాహే తవ జయ గాథా !

జన గన మంగళ దాయక జయహే - భారత భాగ్యవిధాతా

జయహే జయహే జయహే

జయ జయ జయ జయహే.

# ఆహార నిలువలు

| | Name of the Item | Calories per Oz. | | Name of the Item | Calories per Oz. |
|---|---|---|---|---|---|
| 1 | బియ్యం దంపుడు | 100 | 13 | కందిపప్పు | 95 |
| 2 | బియ్యం మిల్లు | 99 | 14 | ఉలవ (Horse gram) | 91 |
| 3 | గోధుమలు (whole) | 99 | 15 | బటానీలు వేయించినవి | 102 |
| 4 | రాగులు (Finger millets) | 98 | 16 | ,, Dry | 89 |
| 5 | సజ్జలు (Cumbu bajra) | 102 | 17 | వంకాయలు | 10 |
| 6 | జొన్నలు (Cholam) | 101 | 18 | బీరకాయలు | 5 |
| 7 | మొక్కజొన్న | 97 | 19 | పొట్లకాయలు | 8 |
| 8 | మొక్కజొన్న పిండి | 101 | 20 | బెండకాయలు | 12 |
| 4 | శనిగెలు (Weth outir husk) | 103 | 21 | గోరుచిక్కుడు | 16 |
| 10 | శనగపప్పు | 106 | 22 | కాకర | 7 |
| 11 | మినప | 99 | 23 | Small కాచర | 17 |
| 12 | పెసరపప్పు | 95 | 24 | Tomatoes | 8 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 25 | అనపకాయలు | 4 | 41 | చింతపండు | 82 |
| 26 | గుమ్మడి సొర్రకాయ | 8 | 42 | అల్లము | 19 |
| 27 | బొప్పాయి | 11 | 43 | బెల్లము | 104 |
| 28 | అరటికాయలు | 19 | 44 | మునగకాయలు | 7 |
| 29 | Raddish ముల్లంగి | 6 | 45 | కొబ్బరికాయలు | 126 |
| 30 | కంద | 33 | 46 | వేరుశనగ | 116 |
| 31 | చామ | 32 | 47 | జీడిపప్పు | 169 |
| 32 | బంగాళాదుంపలు | 28 | 48 | నెయ్యి | 257 |
| 33 | Sweect potata | 37 | 49 | నువ్వుల నూనె | 257 |
| 34 | Onion | 17 | 50 | ఆవాలు | 151 |
| 35 | వెల్లుల్లి Govtic | 40 | 50 | మెంతులు | 95 |
| 36 | Cabbage | 9 | 51 | జీలకర్ర | 82 |
| 37 | కొత్తిమిర Coriyan der | 13 | 52 | ధనియాలు | 99 |
| 38 | కరివేపాకు | 28 | 53 | మిరియాలు | 43 |
| 39 | పచ్చిమిరప | 12 | 54 | ఇంగువ | 84 |
| 40 | ఎండుమిరప | 70 | | | |

| | | |
|---|---|---|
| 55 | బార్లి | 95 |
| 56 | యాలకులు | 65 |
| 57 | పసుపు | 99 |
| 58 | పాలు | 33 |
| 59 | మజ్జిగ | 4 |
| 60 | నిమ్మపండ్లు | 16 |
| 61 | దానిమ్మ | 13 |
| 62 | నారింజ | 14 |
| 63 | బత్తాయి | 14 |
| 64 | కమలాఫలం | 14 |
| 65 | కర్జూర | 80 |
| 66 | ద్రాక్ష | 13 |
| 67 | అరటి | 42 |
| 68 | వెన్న | 238.6 |
| 69 | కోడిగ్రుడ్లు | 49 |
| 70 | గోధుమపిండి (atta) | 100 |
| 71 | మైదా | 99 |
| 72 | కొఱ్ఱలు | 95 |
| 74 | చామలు | 99 |
| 75 | అలసందలు | 93 |
| 76 | శనగపప్పు | 99 |
| 77 | సోయా Beans | 123 |
| 78 | మునగఆకు | 27 |
| 79 | అవిశ Agathi | 26 |
| 80 | గోంగూర Deccan Hemp | 16 |
| 81 | మునగకాడలు | 7 |
| 82 | మామిడికాయలు | 3 |
| 83 | అరటిపువ్వు | 8 |

---

# స్కూల్ పార్లమెంటు—ప్రజాస్వామ్య శిక్షణ

—:0:—

దేశ రాజ్యాంగమువలె ఉపాధ్యాయులు తమ పాఠశాలలలో ఒకనమోనా (Model) పార్లమెంటు నిర్మించవలెను. పాఠశాలయందలి తరగతులు మనదేశములోని రాష్ట్రాలుగా పోల్చవచ్చును. బాలురు వారి తరగతికి ఒక పేరు పెట్టుకొనుడని మని చెప్పవలెను. పౌరసత్వ శిక్షణలో ఈ స్కూలు పార్లమెంటుకు ఎక్కువ విలువ నొసంగినారు. బాలురను కొన్ని స్క్వాడ్సు (Squads) అనగా వర్గములుగా విభజించెదరు. ప్రతివర్గానికొక నాయకుడు ఏర్పడును. తరగతికి ఒకనాయకుడు ఉండును. పాఠశాలకంతటికి (School PupiLleader) నాయకుడుగా బాలురు ఎన్నుకొందురు. ఈ నాయకుడే పార్లమెంటును నిర్మించును. ప్రధానిగా పనిచేయును. వర్గ నాయకులు శాసన సభా ప్రతినిధులుగా పని చేయుదురు. ఉన్నత తరగతుల నాయకులు మంత్రులుగానుందురు. వారు తాము చేయు పనులను కొన్నిటిని నిర్ణయించుకొందురు.

| | |
|---|---|
| ప్రధానమంత్రి | — క్రమశిక్షణ |
| ఆరోగ్యశాఖామంత్రి | — ఆరోగ్యము |
| ఆహార శాఖామంత్రి | — హాస్టల్ వ్యవహారములు |
| ఆర్థిక శాఖామంత్రి | — బడ్జెట్టు వేయుట |
| రక్షిన్యాసమంత్రి | — ద్రవ్యము ప్రోగుచేయుట |
| ఆటలమంత్రి | — ఆటల పర్యవేక్షణ |

విదేశాంగ వ్యవహారములమంత్రి — ఇతర పాఠశాలలతో సంబంధము
కళలు, సంస్కరణమంత్రి — నాటికలు, డ్రామాలు
సహాయమంత్రి — పారిశుద్ధ్యము
వర్గమంత్రి — కార్యక్రమము నడుపుట
పరిశ్రమల మంత్రి — దూది ఇచ్చుట, నూలుతీసి కొనుట, నూలును విక్రయించుట
వ్యవసాయ మంత్రి — తోటను, వ్యవసాయమును చూచుకొనుట

పై విధముగా వారు (Cabint) మంత్రివర్గమును ఏర్పరుచుకొందురు. అనగా భవిష్యద్భారత రాజ్యాంగ పౌరులకు ప్రజాస్వామ్య సిద్ధాంతములందు బాల్యమునుండియే శిక్షణొసంగుటకు స్కూల్ పార్లమెంటు చక్కని అవకాశ మిచ్చుచున్నది. సభ్యులు ఒక పార్లమెంటు స్పీకరును, డెప్యూటి స్పీకరును ఎన్నుకొందురు. స్పీకరుగాని యాజమాన్యమున పార్లమెంటు సమావేశమగును. ఉపాధ్యాయులు గౌరవ అతిథులుగా ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చొనవచ్చును. పార్లమెంటులో డిబేటులు జరుగును. బాలురు అత్యుత్సాహముతో పాల్గొందురు.

ప్రత్యేకముగా స్కూల్ న్యాయస్థానముండును. ఇందు బాలురకు న్యాయసాధన నిర్వహణమందు నిష్పాక్షిక, హేతు

చక్కని శాసన సభ్యులుగా బాలురు తయారగుదురనుటలో ఆశ్చర్యముండునా ?

స్కూల్ ఎన్నికలు బహుబహాడావిడిగా, కోలాహాలముగా జరుగును. S P L ఎన్నికలు: కొన్ని పార్టీలు ఏర్పడును. అభ్యర్థులు ఏన్నికోక్యోగికి నామినేషన్ దరఖాస్తులు పెట్టుదురు. ఎన్నికల ప్రచారము జరుగును. స్కూల్ గోడలపైన, ఊరిలోను, కనబడినచోట్ల అభ్యర్థుల పేర్లు, ప్రచారము చూడనగును. 'ఓటు' విలువ బాలురు తెలిసికొందురు. వరుసగా 'Queue' పద్ధతిలో వచ్చి ఓటువేసి నాయకుని ఎన్నుకొందురు. ఈవిధముగా ఎన్నికలయందు వారికి శిక్షణ కలుగును. భవిష్యత్తులో వారు ఎట్టి చిక్కులేకుండా ఎన్నికలు జరుపకొనుటకు మార్గమేర్పడును.

ఇట్లు బాలబాలికలు బేసిక్ విద్యా సంస్థలయందు ప్రజాస్వామ్య పద్ధతులయందు శిక్షణ పొంది ఉత్తమ శాసన సభ్యులగుటకు అవకాశము లభించుచున్నది. ఉపాధ్యాయులు గొప్ప సహనము కలిగి ఈ కార్యక్రమమును నిర్వహించవలెను.

# బేసిక్ విద్య — వస్తు ప్రదర్శన శాలలు

## MUSEUMS.

—:O:—

విజ్ఞాన శాస్త్ర బోధనయందు వస్తు ప్రదర్శన శాలలు (Museums) ప్రముఖ పాత్రను వహించుచున్నవి. ప్రతి పాఠశాలయందు గ్రంథాలయములు, ఆటలాడు స్థలములు ఏర్పఱచినట్లు వస్తు ప్రదర్శనములకు కూడ విధిగా ఏర్పాటు చేయవలయును. విద్యాబోధనకు ఇదొక దృశ్య సాధనముగా పనిచేయును. నేటి విద్యా విధానములో ఇవి ప్రముఖ పాత్రను నిర్వహించుచున్నవి స్థలాభావము, ద్రవ్యలోభము అను కారణములచే, మనచే వస్తు ప్రదర్శన శాలలను నిర్లక్ష్యము చేయరాదు. ఏదో అధికారుల మెప్పునకై చేయవలెనుగదా అని చేయరాదు. నిజముగా బాలుర పురోభివృద్ధికి మనమెంత కష్టపడితే అంత ప్రతి ఫలము తప్పక సిద్ధించును. కొన్ని పాఠశాలలలో ఏవో కొన్ని పక్షులు-రెక్కలు ఊడిపోయి, ముక్కులు లేక, కాళ్ళు విరిగిన జంతువులు, వానిపైనుండు దుమ్ముకూడ తుడవక పెట్టియుందురు క్రియాయుక్తాభ్యాసనము విద్యకు మూలసూత్రము. అట్టి సూత్రమును ఆచరణలో పెట్టుటకు వస్తు ప్రదర్శన శాలలు ముఖ్యముగా తోడ్పడును. ఉద్యమ పద్ధతికి చక్కని ఉదాహరణము - వస్తు ప్రదర్శనశాలను ఏర్పరచుట వస్తువుల సేకరణ, వానిని సురక్షితముగా యుంచుట, ఆకర్షణీయముగా అమర్చుట

యందు విద్యార్థులు వారికి తెలియకనే ఎన్నో విషయములను నేర్చుకొందురు. ఉపాధ్యాయులను ఈ విషయమందు శిక్షణ యొసంగుటకు ప్రభుత్వమువారు అప్పుడప్పుడు కొన్ని కేంద్రములు స్థాపింతురు. అట్టి అవకాశములు పోగొట్టుకొనరాదు వస్తువులను తయారుచేయు వివిధ పద్ధతులను నేర్చవలయును.

1. **Taxidermy:** కృత్రిమ వస్తువులను తయారుచేసి, గడ్డి, దూది వానిలోపల పూరించి సజీవ వస్తు గుణమును ఆపాదించి, ఆకర్షణీయముగ ప్రదర్శించుట.

2. **Plaster Models:** ప్లాస్టరుతో వస్తువులను తయారుచేయుట 3. మైనముతో చిన్నచిన్న జంతువుల బొమ్మలుచేసి రంగులు వేయుట 4. చేపలు-వివిధరకములు తదితర జంతువులను ఉంచుట.

ఉపాధ్యాయులు, విద్యార్థులు అతిఉత్సాహము. శ్రద్ధతో పనిచేయవలయును. పాఠశాలలయందు డ్రామా సంఘము ఫోటో సంఘము, వస్తుప్రదర్శనశాలా సంఘమును ఒకొక్కటి ప్రతిపాఠశాలకు స్థాపించనగును. వింతవస్తువులను సేకరించుట, భద్రపరచుట విద్యార్థుల యందొక సహజాతము. ఇట్టి సహజాతమును నిర్మాణాత్మక కృషియందు ఉపయోగపరచినవారు సులభముగా అనేక విషయములు నేర్చుకొందురు. పోస్టాఫీసు బిళ్ళలు, అగ్గిపెట్టెల కాగితములు, నాణెములు, బొమ్మలు మనము చెప్పకయే బాలురు సేకరించుట మనము చూచు

చున్నాము గదా! విహారయాత్రలకు పోవునప్పుడు వస్తు సేకరణకు చక్కని అవకాశము లభించును వింతవస్తువులను సేకరించి తెమ్ము అనగానే బాలురు తదేక దృష్టితో వస్తువులను నన్వేషింతురు. బాలురు వలల సహాయ్యమునరంగు రంగులుగల సీతాకోక చిలుకలు, చిన్న కీటకములను, వింత జంతువులను పట్టవలయును వారినొక్క యుండు 70 సారాయిలో వానిని పడవేసి భద్రము చేయవలెను లేదా 4% ఫార్మాల్ ద్రవమున్నైనా వాడవచ్చును. పక్షులు వివిధ రకముల కీటకములు, జలచరములు, ఇసుక నేలపైనుండు గవ్వలు మొదలగు వస్తువులను సులభముగా సేకరించ వచ్చును. బ్రిటిషు వస్తుప్రదర్శన శాఖాధికారులు అప్పుడప్పుడు ప్రకటించు గ్రంథములు మనకెంతో లాభదాయకము.

సేకరించిన వస్తువులను క్రమపద్ధతిలో ఏర్పాటు చేయవలయును. మద్రాసు మూర్ మార్కెట్టు లాగున కలగూర గంపగా వేయరాదు. ఆయా విషయములకు సంబంధించినవి ప్రత్యేకముగా విడదీసి వివిధ భాగములుగా అమర్చవలెను.

పాఠశాలా ప్రణాళికలోని విషయముల క్రమమును గుర్తుపెట్టుకొని అదే క్రమములో వస్తువును ఏర్పాటుచేయవలెను. ప్రణాళిక ననుసరించి ఉంచిన ఉపాధ్యాయులకు, విద్యార్థులకు చాలా ఉపయోగము. పక్షులు తినెడి ఆహారము దాని కనుగుణ్యమగు అంగనిర్మాణము, అలవాట్లను బోధించు

టకు పటములద్వారా సాధ్యముకాదు. కాని వస్తుప్రదర్శన శాలద్వార సులభముగా గ్రాహ్యపరచవచ్చును. పిల్లి మాంసమును చీల్చుటకు, కుందేలు గడ్డిని కొరుకుటను సేవృము చేసిన అంగనిర్మాణమును వస్తుప్రదర్శనశాలలో చూడవచ్చును. నల్లబల్లపై బొమ్మలువేసి 'పాము—విషపుకోరలు—విషయము' చెప్పలేము. సాక్షాత్తుగా పెద్దపాము మోడల్ చూచిన బాలురు సులభముగా ఆ విషయమును నేర్చుకొందురు. వస్తుప్రదర్శన శాలయందు నిజమైన జంతువులనుకూడ పెంచవచ్చును. వానిచలనము ఆహారము తినుట, ఊపిరిపీల్చుట మున్నగునవి స్వయముగా చూడగలుగుదురు. జీవితచరిత్రలు, వివిధదశలు బాగుగా పరిశీలించవచ్చును. ఎన్నూరు ప్రభుత్వ శాలకు వ్రాసిన తక్కువ ధరలకు మనకు కావలసిన వస్తువులు పంపుదురు.

ఆంధ్రరాష్ట్రములోని మండలముల నైసర్గిక నమూనాలు తయారు చేయించవలయును. వివిధ మండలములలో దొరకు ఖనిజములు ఒక వరుసలో ఏర్పాటు చేయవలెను. రాష్ట్రములో పండు వివిధపంటలు, పండ్లు, కూరగాయలు వరుసగా అమర్చవలెను. ఏయే రాజుల కాలమున ఏయే నాణ్యములు చలామణి ఆయినవో చూపుటకు వరుసగా కాల క్రమము తప్పకుండా ఏర్పాటుచేసిన చరిత్రబోధనకు సాయపడును. అట్లుఏర్పాటుచేసిన తర్వాత వాని పేర్లను అచ్చుకొట్టి వస్తువులకు అతికించవలెను. సేకరణచేసిన బాలుని పేరు

వ్రాయవలెను. తేది, స్థలము కూడా వేసినమంచిది. గాజు బీరువాలను వాడవలెను పిల్లలు తీయకుండా బీగములు వేయవలెను ఈ విషయమున పాశ్చాత్యులు పిల్లలయెడ ప్రత్యేక శ్రద్ధవహించి వారికి తగిన వస్తుప్రదర్శనశాలలు, అవకాశములు కల్పించినారు. వారినుండి మనమెంతయో నేర్చుకొనవలెను. "Museum is a store house of knowledge "Satyamurthi".

విలువలు:- బాలురయందు పరిశీలనా శక్తిని అభివృద్ధి పరచవచ్చును. సృష్టిలోనుండు విచిత్ర వస్తు సంపదను అందఱును చూచుటకు వీలుండును. వస్తు ప్రదర్శనశాల యందుంచిన అందఱు చూచి సంతోషపడుదురు. జ్ఞానమునువృద్ధి చేసికొందురు. కాలగర్భమున కలసిపోవు వస్తువులను శాశ్వతముగా ఒకచోట ఏర్పాటు చేసినవారమగుదుము. పూర్వులు వాడిన వస్తువులు, వారి జీవిత విధానములు చూచిన మనకెంతో ఆశ్చర్యము, వారియెడ గౌరవము కలుగును. వస్తు ప్రదర్శన శాలలు సంస్కారణా కేంద్రములుగా పనిచేయును. మనజాతి చరిత్ర, సాంప్రదాయములు, నాగరికతలు సులభముగా గ్రాహ్యమగును. వస్తువులు మనోభావములు ప్రేరేపించునవిగాను, సౌందర్య పిపాసను పురికొల్పునవిగాను ఉండి ప్రేక్షకునికి ఆనందము కూర్చునవిగానుండవలెను. బాలుర యింద్రియ శిక్షణకు తోడ్పడును. పరిశోధనకు ఎక్కువ అవకాశముల నొసంగి

వస్తుప్రదర్శనశాలా నిర్వాహణను పురికొల్పును. బాలుర మనస్సులందు శాశ్వతముగా విషయజ్ఞానము నిలువునట్లు చేయును. ఎవరో చెప్పినది వినక తామే స్వయముగా పరీక్షించుట వలన నేర్చిన విషయములందు గట్టి నమ్మకము కలుగును. బొమ్మనుచూచి నేర్చు విషయముకంటె అసలువస్తువునే స్వయముగా పరీక్షించి నేర్చినది శ్రేష్ఠతరము. ఉత్సాహ ఆనందములతో కూడిన జ్ఞానము కలుగును. బాలుర మేధస్సును, మనోభావములను అభివృద్ధి పరచును. విరామ కాలమును వ్యర్థపుచ్చక విజ్ఞానమును వినియోగపరచుట బాలురు నేర్చుకొందురు. అమూల్యమైన నిర్వాహణా శక్తిని బాలురయందు అభివృద్ధి చేయవచ్చును 'క్రియాయుక్తాన్వేసన విద్య' కుదాహరణమే. ఈ వస్తుప్రదర్శన శాలలను ఏర్పాటు చేయుట. ఇందుచే బాలుర మానసిక, శారీరక శక్తులు తీవ్రముగా పని చేయును. వారికి తగిన శిక్షణ నిచ్చి సన్మార్గమున ప్రవర్తింపచేయుటకు వీలుండును. బాలురయందుండు కౌతుక, నిర్మాణశక్తులు సహజాతములు ఉదాత్తము చేయబడును. విద్యనేర్పుటకు, అనగా జ్ఞానార్జనకు వస్తుప్రదర్శనశాలలు దృశ్యసాధనములుగా పనిచేయును. ఇవి మేము చేసిన వస్తువులని గర్వించి వానిని ఇంకా బాగుగా చేయుదము అను స్వభావము పెరుగును. (Law of effect) తాము నేర్చిన విద్యాసూత్రముల సహాయమున అనేక రకములైన కష్టములు దాటగలరు. విషయ జ్ఞానము శాశ్వతముగా వారి స్మృతియందు నిలచిపోవును. ఇవికాక సహేతుక

విమర్శనా దృష్టి, ఆలోచనా, ఊహ మున్నగు మానసిక శక్తులు చురుకుగా పనిచేయును. నివేదికలు తయారుచేయుట, పటములు తయారు చేయుట, మాడల్సు నిర్మించుట మున్నగు మంచి ఉపయుక్తమగు అలవాట్లు నేర్చుకొందురు. మంచి నాయకులుగా, ఉన్నను సాధకులుగా తయారగుదురు.

మానవ పరిణామము: వివిధదశలు ప్రతిబింబించు శాఖ ఒకటి ఏర్పాటుచేయవలెను. వివిధ దేశములందలి స్త్రీ పురుషుల దుస్తులు, అందములు, గృహనిర్మాణ చరిత్ర, మానవులు, జీవితపద్ధతులు వివిధకాలములందు ఎట్లుండినవి, దుస్తుల చరిత్ర, ఏయే కాలములలో ఎట్టి ఆహారము భుజించినది, రాకపోకల చరిత్ర, ప్రభుత్వములు వివిధ రకములు, పటములు మాడల్సు తయారుచేయవలెను.

కళలు: వివిధదేశములయందలి కళలు, ఏయే కాలమున కళలు ఎట్టిదశలో నున్నవి, వాని అభివృద్ధిని సూచించు పటములు, ప్రభుత్వము ఎట్లు ఎన్నుకోబడినది, వ్యవహారములు సూచించు పటములు, నేటి మన రాజ్యాంగపు విధాన పటము తయారుచేయవలెను.

వస్తుప్రదర్శనశాలలోని వస్తువులు మూడు లక్షణములు కలిగి ఉండవలెను. 1. సత్యమ్: మనము చేయువస్తువు సేకరించిన వస్తువు శాశ్వతముగ నుండవలెను. సృష్టిని ప్రతిబిం

బింపచేయవలెను. సృష్టి కర్తయందు భక్తి విశ్వాసములు కలుగునట్లుండవలెను. పదిమందికి నూతనముగా నుండినదానిని వారు చూతురు. సర్వసాధారణ వస్తువులు మనము సేకరించిన లాభములేదు. ఒక విధమైన వింత, నిర్మాణకౌశలము, నైపుణ్యము, శోభ ఉండవలెను. అది ఆకర్షణీయముగా నుండవలెను. 2. శివమ్ : అనగా మంగళమకరమని అర్థము. మన వస్తువుల ద్వారా జ్ఞానమును ప్రసాదించవలెను. ప్రేక్షకులకు గాని, విద్యార్థులకుగాని ఉపయోగకరముగా నుండవలెను. ఉపయోగములేనిది మన కష్టము వృధాయగును నలుగురు బాగుపడిన మన వస్తుసేకరణకై పడిన కష్టమునకు తగిన ప్రతిఫలము లభించును. దీనినే ప్రయోజనాత్మక విలువ యని పిలుతురు. 3. సుందరమ్ : ఏదైన సరే చూచుటకు సుందరముగా నుండవలెను. పదిమందిని ఆకర్షించునట్లు ఉండవలెను, వింతగానైన నుండవలె లేదా అందముగానైన నుండవలె. అసహ్యము కలిగించునదిగా నుండరాదు. అట్టిదానిని ఏర్పాటుచేయుటయందు కడు నిపుణతను ప్రదర్శింపవలెను. అజంతా, ఎల్లోరా, అమరావతీ, హానుమకొండ శిల్ప చాతుర్యము ప్రదర్శించు శాఖ నొకటి ఏర్పాటు చేయువలెను.

వేయించి పెట్టవలయును. కాగితములతో, అట్టలతో వారి ఊహా కొలది గొప్ప భవనములు. కోటలు, [illegible], గోల్ గుంబజ్ మినార్, తాజమహల్ మొదలగునవి చేయించవలెను. వారు తొలుత చక్కగా చేయలేక పోవచ్చును; కాని క్రమముగా అభివృద్ధిగాంచుదురు. ఇట్టి పనియందు చేతికి, కంటికి మేధస్సునకు పని కలుగును. అస్పష్టముగానున్న భావములు, అనుమానములు అంతరించి స్పష్టమైన, నిర్దుష్టమైన భావములు ఏర్పడును. భావనాశక్తి విమర్శనాశక్తి అభివృద్ధి చెందును. బుద్ధికుశలత, హృదయ విశాలత, మనోవికాసము చేకూడును. తలిదండ్రులు చూచి సంతోషింతురు. అట్టివి పాఠశాలలు గర్వింపదగిన విషయములు. మన గౌరవము హెచ్చును. క్రియాయుక్తాభ్యసనము జరుగును. కష్టములేకయే, ఎట్టిబలత్కారము చేయకయే విద్యావిషయములు సులభముగా వేగముగా యథేచ్ఛగా గ్రహింప వీలగును.

ఒక పాఠశాలలో ప్రదర్శనము - నమూనా భూగోళ శాస్త్రము:

1. ఆ పాఠశాలయందు పట్టణపు ప్రాముఖ్యమైన నిమ్నోన్నతములను, కట్టడములను సూచించు పట్టణ చిన్న నమూనా (Miniature model of the town)

2. పాఠశాలా భవనము - నమూనా

3. ఫిర్కా, తాలూకా, జిల్లాను బంకమట్టితో గాని, ప్లాస్టరు (Plaster) తో గాని, గుజురుతో గాని చేయబడిన ఉబ్బెత్తుపటములు, బొమ్మలుగల పుస్తకములు, గ్రాఫులు, నైసర్గిక స్వరూపములు.

4. శీతోష్ణస్థితి, వర్షపాతము, వ్యవసాయము, ఖనిజములు, పరిశ్రమలు, జనులభాషలు, రాకపోకలు, ఎగుమతి, దిగుమతులు సూచించు పటములు లేదా వస్తుసముదాయము.

5. ప్రయాణ సౌకర్యములు: అట్టలతో గాని లేదా (Plaster) తో గాని మోటారుకార్లు, బండ్లు, విమానములు, రైళ్ళు చేసి, పెట్టవలెను.

6. స్థానిక గృహపరిశ్రమల కొరకగది ప్రత్యేకించవలెను. పరిశ్రమలందలి వివిధ దశలు సూచించు పటములు, స్థానికములుగా దొరకు ముడిపదార్థములు. అట్టిపరిశ్రమల ద్వారా వచ్చు ఆదాయ వ్యయములు చూపవలెను.

7. జిల్లాలోని ప్రదేశములలోని పవిత్రనదులు, పుణ్యక్షేత్రములు, చారిత్రాత్మక స్థలములు, వానికి సంబంధించిన బొమ్మలు కత్తిరించి పెట్టవలెను. కాగితములతో అట్టలతో లేదా (Fret wood) ఫ్రెట్‌వుడ్‌తో నమూనాలు చేయించవలయును.

8. సిలబస్: పెద్దకాగితముపై ఒక్కొక్క తరగతికి ప్రతి నెలను బోధించునట్టి విషయములు, వానికి ఎదురుగా

విద్యార్థులు చేయునట్టి చేతిపనులు చిత్రరూపముల వ్రాయవలెను
5 నుండి 8వ తరగతి వరకు ప్రణాళిక వ్రాసి ఉంచవలెను.

గృహముల చరిత్ర :

అనంతపురములో ఇటికలు, బళ్ళారిలో రాతియిండ్లు, కడప కర్నూల్‌లో నల్లరాతియిండ్లు, జపాన్ దేశములో కాగితపు ఇండ్లు, అమెరికా దేశమున సిమెంటు కట్టడములు పోత ఇండ్లు, బర్మా దేశములో చెట్లపై కట్టబడిన యిండ్లు, బోర్లించిన పెద్దగంపలను పోలిన నీగ్రోల గృహములు, అరేబియన్ల బట్టల గుడారములు, కర్జీల చర్మపు గుడారములు, ఎట్టియిండ్లని యన్ల పొగగూడు యిండ్లు, పేరిన మంచుతో నిర్మింపబడిన ఎస్కిమోల గృహములు—బొమ్మలుగా లేదా నమూనాలుగా చేసి ఉంచిన ఎంతటి విజ్ఞానము కలుగదు !

9. ప్రపంచపు నానాదేశపు దుస్తులు చూపు బొమ్మల పుస్తకములు, అట్టను కత్తిరించి దానికి దుస్తులు తొడుగుట, దుస్తుల వింత విశేషములను సులభముగా నిరూపించవచ్చును. మానవుడు తొలుత వాడినదుస్తులు — క్రమేణ ఎట్లు అభివృద్ధి చెందినది సూచించు పటములు.

10. ప్రపంచపు ముఖ్యపట్టణములు, వాని జనసంఖ్య వినోద విషయములు, వృత్తులు చూపు ఛాయా పటములు.

11. నానాదేశవాసులు రూపములుచిత్రించు మోడల్సు స్త్రీ పురుషుల విగ్రహములు.

12. రాకపోకలు: బండి, జట్కా, కోచ్, జాంగా, రిక్షా సైనా ఒంటి చక్రపుబండి (wheel Barrow), సైకిల్, మోటారు సైకిల్, మోటారుకారు, రైలు, స్లెడ్జీలు — నీటిపై పడవ, ఓడ, స్టీమరు, సబ్ మెరైన్, టార్పిడో మొదలగునవి,

గాలిలో: బెలూన్, విమానము, మాత్, జెప్లిన్, డకోటా (Pilotless aeroplanes)

13. దేశము, ప్రపంచము, పహాజపైరు పచ్చలమండ లములు.

14. అద్భుత దేశకథలు: వానరభూమి, మఱుగుజ్జులు (ఉష్ణమండలపు అడవులు), ఒంటెలు, అరబ్బులు, టాండ్రా రెయిండీర్లు, ఆఫ్రికా నీగ్రోలు, గాలియంత్రములు, క్రైస్తవుల పుణ్యక్షేత్రము - జెరుసలమ్.

15. సామాన్యవస్తువుల చరిత్రలు: కాఫీ, టీ, నూలు, ఉన్ని, అగ్గిపెట్టెలు, కాగితము, గాజు, పెన్సిళ్ళు, కలములు, కత్తులు మున్నగునవి.

16. ప్రకృతిపరిశీలన ప్రదర్శన వస్తువులు: నేలయందలి కాయలు, వింతవింత చెట్లు - చేమలు, పూలు, మాంసాహార మును భుజించు మొక్కలు (fly trap Mesomia) వివాహ ములు చేసికొని జంతువులవలె సంతానము కను మొక్కలు

(Mass, Fungus, Ferns, etc.,) పూలు పూయని మొక్కలు, అనేక వింతలు ప్రదర్శింపవచ్చును. ఇంటితోట పద్ధతులు, ఆధునిక తోట పనిముట్లు కూడ ఉంచవలెను.

17. పైరులను నాశనముచేయు కీటకాలు, నివారణోపాయములు సూచించు పటములు, సేద్యానికి మిత్రులు, శత్రువులను సూచించు పటములు.

18. ఆరోగ్యశాస్త్రము: రోజూను మనము తిను ఆహారము, తినవలసిన ఆహారము ఉష్ణశక్తి, విటమినులు, వాని ఉపయోగములు, ఆదర్శక గృహము, పురాతన గృహము.

ఆదర్శక బావులు: పురాతన బావులు, ఇట్టి పురాతన విషయములు, ఆదర్శ విషయములు, మోడల్సు చేసి ఉంచవలెను.

అంటువ్యాధులు: వాని నివారణ, ముందుగా తీసికొను జాగ్రత్తలు.

ప్రథమ చికిత్స ప్రదర్శనమునకు ప్రత్యేక గది ఏర్పాటు చేయవలెను. పాముకాటు, కుక్కకాటు, బావిలోపడిన మనుష్యుడు, అగ్నిప్రమాదము, ఎముకలు విరుగుట - అట్టి అవసరమున మనము చేయవలసిన ప్రథమ చికిత్సను సూచించు పటము.

భాషాప్రదర్శనము : భాషాభాగ వృక్షము — రామాయణ మహాభారతములు బొమ్మలద్వారా ప్రదర్శించుట, కవుల కాలపట్టిక (సంస్కృత-ఆంధ్రకవులు) - వారు రచించిన గ్రంథములు — ఆంధ్ర లిపి- దాని అభివృద్ధి కృతికర్తలు — కృతిభర్తలు, కవుల ఛాయాపటములు, సామెతలు, బొమ్మల

రూపమున చేయుట: 'తీగకు కాయ బరువా' 'ఉడుతకు ఉడుతాభక్తి' 'ఆకలి రుచి ఎరుగదు' 'దరిద్రము సీతి ఎరుగదు' 'నిండుకుండ తొణకదు' 'కల్లులేనివానిని గోల్డుకూడ కఱచును' సంస్కృత, ప్రాకృత, తెనుగువర్ణములు తెలుపు పటములు.

చరిత్ర : చరిత్రాత్మక పురుషుల పటములు కాలక్రమమునననుసరించి వేయవలెను. దేశనాయకులు, ఆంధ్ర మంత్రివర్గము, కేంద్ర మంత్రివర్గపు నాయకులు, వివిధ దేశముల నాయకుల పటములు వ్రాయవలెను.

మైనము : బంకమన్ను, కర్పూరము, ప్లైట్ వుడ్, బెండు, సన్నగార మొదలగునవి వాడవచ్చును. నాణెములు, తపాలా బిళ్ళలు, కార్డులు, చేయవలెను.

మ్యాజిక్ లాంతరు, శ్రవణయంత్రముల సహాయమున ప్రపంచములోని అనేక వింతలు చూపవచ్చును. ప్రతిపాఠశాలకు మ్యాజిక్ లాంతరు, ఫలకములు (slides) తప్పక ఉండవలెను.

ప్రతి దేశపు జనసంఖ్య తారతమ్యములను తెలుపు పటములుండవలెను. దేశముల విస్తీర్ణము, ఆయా దేశపు బానిస, వలస, భాగములు — ప్రపంచ విస్తీర్ణము తెలుపు పటములను తయారుచేయవలెను.

భారతదేశపు పటము (వాని అందుగల వివిధ రాష్ట్రములు, ముఖ్యపట్టణములు, భాషారాష్ట్ర విభజన, దేశము యొక్క స్వరూపము, మనదేశ రాష్ట్రముల ఆదాయవ్యయములు చూపించు పటములుకూడా తయారు చేయవలెను.

లేసు నేత, వలలల్లుట, రంగు కాగితములతో అనేక రకములైన పువ్వులు, ఆటవస్తువులు తయారు చేయవలెను. చాపలు, గంపలు, కర్రపని, మట్టితో కప్పలు, తట్టలు చేసి రంగులు వేసి ప్రదర్శింపవలెను. బాలురు చేయు కుటీర పరిశ్రమలు ఒక శాఖగా ప్రదర్శించ వచ్చును.

బాలుడు పాఠశాలయందు నేర్చిన విజ్ఞానమునకు ఒక రూపము, రీతి ప్రదర్శనముల ద్వారా కలుగును. కనుక ప్రదర్శనములు బాలుర విజ్ఞానప్రదర్శనములే అనుటలో ఆశ్చర్యము లేదు. ప్రదర్శనములు పాఠ్య ప్రణాళికయందు తప్పనిసరి అంశములుగా చేర్చినారు. బాలురు వానిని 'ఉద్యమ'ముగా తీసికొని ఉత్సాహముతో పని చేయుదురు. అట్లు చేయుటవలన ఎన్నో విషయములు నేర్చుకొని బాలురు యథేచ్ఛగా విజ్ఞానమును సంపాదించెదరు.

# విహారములు.

—:O:—

వివిధ దేశముల విద్యావిధానముల నొకసారి స్థూలముగా పరిశీలించిన చాలాకాలమునుండి విద్యాప్రణాళికలో విహారములకు ప్రముఖ స్థానమున్నట్లు గోచరమగును. గొప్ప విద్యా వేత్తలలో నొకడగు పెస్టలాజీ (Pestalozzi) తాను స్థాపించిన ప్రయోగాత్మక పాఠశాలలో పొలముపనికి (Field work) విశేషమైన ప్రాముఖ్యత నిచ్చినాడు. జర్మని దేశములోని పాఠశాలలందు విహారములు నిర్బంధాంశములుగానున్నవి. ఇంగ్లాండు దేశపు బాలురు స్విట్జర్లాండు ఇటలీ, ఫ్రాన్సు మున్నగు ప్రదేశములకు విహారములకు వెళుట లేని యెడల వారి విద్య పూర్తి గాదట. నేను నూతన విద్యా విధానములో సాంఘికశాస్త్ర ప్రణాళికయందు విహారములు తప్పని సరియగు నంశముగా చేసినాను. కొందరు పట్టభద్రత సంపాదించినను లౌకిక జ్ఞాన శూన్యులుగా నుందురు. రైలు ప్రయాణము చేయని రైలు చూడని విద్యార్థులెందరో కలరు. విద్యార్థుల క్రొత్త స్థలములను చూడవలెనని కుతూహలపడు చుందురు. అట్టి సహజ వాంఛను ఉపాధ్యాయుడు విహారముల ద్వారా తీర్చి అట్టి అవకాశములందు కావలసినంత జ్ఞానమును చేకూర్చవచ్చును

చిన్న తరగతులందు ప్రకృతిపరిశీలన, చరిత్ర, భూగోళ శాస్త్రము, సాంఘిక శాస్త్రములను బోధించుట [illegible] వానికి విహారములు ఎక్కువ తోడ్పడును. ప్రత్యక్షజ్ఞానము కలుగును. క్రియా యుక్తాభ్యాసన సూత్రము నిందుకు చక్కగా ప్రయోగింపబడినది. [illegible] బాలురు విహారములందు ఎక్కువ స్వేచ్ఛననుభవింతురు. ఉపాధ్యాయునితో కలిసిమెలిసి తిరుగుదురు. పాఠశాలయందలి 'నియమిత వాతావరణము' చే విసుగు చెందిన విద్యార్థులకు విహారములు ఎంతో ఆనందము కలిగించును.

విలువలు :— 1. కూపస్థ మండూకములవలె బాలురను పెంచక బాహ్య ప్రపంచానుభవమునకై విద్యార్థులను అప్పుడప్పుడు విహారములకు తీసికొనిపోవలయును. ప్రత్యక్షజ్ఞానము విద్యార్థులకు అత్యవసరము. సహకార సంఘీభావములు, ఐక్యత, సోదరభావము మున్నగు మంచి గుణములు నేర్చుకొందురు. హెచ్చుతగ్గులు మరచిపోయి అందరును కలసి పని చేయవలెనను 'సమిష్టి' భావము వృద్ధిజెందును. ఒక పనిని బాధ్యతతో నిర్వహించుట నేర్చుకొందురు. వ్యక్తిత్వదృష్టిని మరచిపోయి సమిష్టి దృష్టిని అలవాటు చేసికొందురు.

2 పాఠశాలయందలి విషయములను ఉత్సాహముగా గ్రహించుటకు విహారములు ప్రేరణగా పనిచేయును. గొప్ప అభిరుచిని కలిగించును. ఒకసారి కర్నూలు, మద్రాసుకు పిలుచు

క్రమలయందు ఎట్లు అన్వయింపబడినాయో, అవి జీవితమున ఎట్లు ఉపయోగపడుచున్నవో తెలిసికొనుటకు విహారములు ఎక్కువ తోడ్పడును. పైథాగరస్, ఆర్కిమెడిస్, నికోలస్ న్యూటన్ సూత్రములు బాహ్యప్రపంచమున నెట్లు, అన్వయింపబడి మానవ జీవితమును సుఖవంతము చేసినవో గమనింపగలరు. లేదా ప్రత్యక్షముగా యంత్రములను, ఆనకట్టలను, శాసనసభలను, చూచిన వాని నిర్మాణ మే సూత్రములపై జరుగునను జిజ్ఞాసచే పాఠ్య ప్రణాళికా విషయములు సులభముగా, త్వరితముగా నేర్చుకొనుటకు వీలుండును. బాలురయందు అత్యుత్సాహము, అమిత శ్రద్ధ బలియును.

4. విహారములు పాఠశాల వాతావరణ విసుగునుండి విముక్తులను చేయును. బాలురు సహజముగా క్రీడాభిలాష కలిగి యుందురు. వారికి చైతన్యవంతమైన పనులయందు ఆసక్తి ఎక్కువగానుండును. కనుక పాఠశాలలో నియమిత కాలములో ఇట్టి సహజశక్తులకు తగినంత అభివృద్ధి చేకూరదు. విహారములద్వారా వానిని బహిర్గతను చేసి ఉదాత్తము చేయవచ్చును. బాలురు ఒక ప్రదేశమునుండి మరొక ప్రదేశమునకు ప్రయాణము చేయవలెనని కుతూహలము కలిగియుందురు. ఇట్టి ప్రయాణవాంఛను విహారములద్వారా తీర్చగల్గుదుము. నూతన అనుభవములను పొంది తన భవిష్యజ్జీవనమునకు వలయు శిక్షణ పొందును. అధునా తన సృష్టములు, క్రొత్త విషయములు (సాంఘిక, రాజకీయ, ఆర్థిక), ఎప్పుడో ముద్రింపబడిన పాఠ్యగ్రంథముల ద్వారా విద్యార్థులు గ్రహింపలేరు.

ఉదాహరణ :— లోహపు యుగపు అస్త్రములు, నూతన వ్యవసాయ పద్ధతులు, నిర్మాణ శాస్త్రమునందలి నూతన మార్పులు, అంతర్జాతీయ వ్యవహారములు, స్థానిక సాంఘిక మార్పులు, ప్రణాళిక గాని వివిధ విషయములకు పరస్పర సంబంధము విహారముల ద్వారా సిద్ధించును.

నిర్వహణ :— విహారమునకు ముందుగా ఉపాధ్యాయుడు ఒక నిర్దిష్టమైన కార్యక్రమమును నిర్ణయించుకొనవలయును. ఏ స్థలమును సందర్శింపదలతురో నిశ్చయించుకొని అధికారులకు ముందుగా వ్రాసి తెలియపరచవలెను. ప్రయాణమునకు వలయు సామగ్రిని చేకూర్చుకొనవలయును. తాము చూచిన విషయములను సంక్షిప్తముగా వ్రాయుటకు ఒక దినచర్య పుస్తకము, ప్లానులు వ్రాయుటకు డ్రాయింగు పుస్తకము ప్రతి విద్యార్థియు కలిగియుండవలెను. ఉపాధ్యాయుడు తనవెంట ఒక ప్రథమ చికిత్సపెట్టెను, వలయు ఔషధములు, క్వినైన్ మాత్రలు, సిబాజాలు మందు, జామ్‌బక్ లేక పెన్‌సిలిన్, పైపూతమందు తీసికొనిపోవలయును. ముందుగా బాలుర తలిదండ్రుల అనుమతి బడయుట చాలా ముఖ్యము. విహారముల ద్వారా విద్యార్థికి, ఉపాధ్యాయునికి ప్రత్యక్ష సంబంధము ఏర్పడును. ఉపాధ్యాయునితో స్వేచ్ఛగా మెలగుచు, తమ అనుమానములు నిర్భయముగా తీర్చుకొందురు. విద్యార్థులందరు వచ్చుటకు వీలగు సమయమును, స్థలమును నిర్ణయించవలెను. ప్రయాణ సౌకర్యములకు వలయు తిండితీర్థములు, వాహక సిబ్బందిని ముందుగానే ఆలోచించి తయారగుట మంచిది.

అందరిని ఒకసారి పిలుచుకొని పోవుటకు వీలుండదు. అట్టితఱి విద్యార్థులను వర్గములుగా విడదీయవలయును. ఒక్కొక్క వర్గమును ప్రత్యేకముగా పిలుచుకొని పోవలయును. ఆ వర్గమును తిరిగి కొన్ని చిన్న వర్గములుగా విభజింపవలెను. ఒక్కొక్క చిన్నవర్గమునకు వర్గనాయకుని నెన్నుకొనవలెను. ఉపాధ్యాయుడొకడు అందరి అవసరములను చూడలేడు. కాన వర్గనాయకులు ఉపాధ్యాయునితో తమ వర్గముల అవసరములను నివేదించెదరు. విహారస్థలములయందు ఉపాధ్యాయుడు బాలురయందు తప్పులుపట్టి తన అధికారమును చెలాయించిన విహారములు నిష్ఫలమగును. అట్లుగాక వారికి ఉత్సాహమును కలిగించి తద్వారా జ్ఞానార్జన కలుగునట్లు చూడవలెను. బాలురు సక్రమముగా నడచుకొనుటకు మార్గముల జూపుచు, తానుగూడా విద్యార్థులలో నొకడై పోవలయును. వర్గనాయకులు సోదరభావముతో మెలగవలయును. ఒకడు కట్టెలు తెచ్చుట, మరొకడు నీరుతోడుట, వంటచేయుట, వడ్డించుట, అంటుపాత్రలను తోముట, వరుసగా నొకరు తరువాతనొకరు వంతువారిగా పనిచేయుట నేర్చుకొందురు. సమిష్టిజీవనము యెట్టిదో తెలిసికొందురు. విద్యార్థులు తమ అవసరములు వర్గనాయకుల ద్వారా ఉపాధ్యాయుని తెలుపవలయును.

విహారస్థలమునకుచేరిన తరువాత అందు చూడవలసిన దృశ్యములు, దానికి తగిన కాలమును, జాగ్రత్తగా నిర్ణయించవలెను. వస్తుప్రదర్శనశాలకు సేకరింపదలచిన వస్తువులను

తెలుపవలయును. కాలమునకు మించిన కార్యక్రమము వేసి, తెచ్చిన ఆహారపదార్థములు ఖర్చైపోయి, రెండు మూడు రోజులు ఉపవాసముచేసి 'వద్దురా పుడేపుడా ఈ విహారములు' అని బాలురు నిస్పృహ చెందునట్లు చేయకూడదు. 'మరొక విహారమునకు పోవుదము' అను ఉత్సాహము వారికి కలుగునట్లు విహారములను నిర్వహించవలెను. విసుగు, నిరుత్సాహము, నిస్పృహ జనింపచేయరాదు విద్యార్థులు స్వపేరణచే విషయములను చూచి దినచర్య పుస్తకమందు వ్రాయవలయును. బాలురు కాపీ (Copy) చేయకుండా చూడవలయును. ప్రతివిద్యార్థి ఏదో ఒక వింతను ఉపాధ్యాయునికి ఎఱుక పరచవలయునని చెప్పిన అంశము వారుచూచిన వింత విషయములువ్రాసి చెప్పెదరు తాను చూచినది, అనుభవముచే గ్రహించినది పుస్తకమందు వ్రాయవలెను. విహారానంతరము విహారములయందు మనకు తోడ్పడినవారికి కృతజ్ఞత దెలిపి రావలయును. వారిచే హృదయపూర్వకమైన వీడ్కోలు పొందవలయును. విహారస్థలములను అశుభ్రపరచక అచ్చటి వస్తువులను పాడుచేయక క్రమశిక్షణతో మెలగవలయును.

అనంతరకార్యక్రమము :— విహారానంతరము చూచిన విషయములను; పొందిన లాభములను ప్రతి విద్యార్థియు వ్రాసి ఉపాధ్యాయునికీయవలెను. చర్చలు జరుపవలయును. అట్లు చేయుటవలన జ్ఞానోదయము, భావప్రకటన కలుగును.

విద్యార్థులు విహారములలో కన్న స్థలాన్ని, అప్పటి చిత్రములు నమూనాలు తయారు చేయవలెను. తాము సేకరించిన వస్తువులను వస్తుప్రదర్శనశాలలో అందముగా అమర్చవలెను.

ఆటంకములు :— విహారములందు ఉత్సాహము లేని ఉపాధ్యాయుడు పనికిరాడు. ఒక్కొక్కప్పుడు ద్రవ్యాభావముచే విహారములు నిలిచిపోవును. ఒకసారిగా ద్రవ్యమును సమకూర్చలేము. తిన్నగా నెలకు కొంత ద్రవ్యము ప్రకారము చేకూర్చవలెను. లేదా, ప్రభుత్వముగాని, స్థానిక సంస్థలుగాని ద్రవ్య సహాయము చేయవలెను. అమెరికా దేశములో ప్రభుత్వమే విహారఖర్చులు భరించును. మన దురదృష్టము కొలది పోయిన చోటకు సరిగా వసతులు రానడము సంభవించును. నదులు, వంకలు, వాగులు, ఆటంకములుగానుండును. అన్నియు జాగ్రత్తగా చూడవలెను. సాహసముతో ఆటంకములను నివారించవలెను. ప్రయాణ సౌకర్యములు సరిగా నుండవు. ప్రతిపాఠశాలకు ఒక మోటారు వ్యాన్ ఉండవలయును. లేదా సీటుబస్సులు వీరి సహాయమునకు రావలయును. రైలు ప్రయాణములుచేయునప్పుడు తగ్గింపు ఛార్జీలు ప్రభుత్వముఇచ్చుచున్నది. అట్లుగాక విద్యార్థులు భవిష్యద్భారత పౌరులు, నిర్మాతలు కాన వారి పురోభివృద్ధికై రైలుప్రయాణములు ఛార్జీలేకుండ చేయవలెను. ప్రభుత్వము (Excursion Passes) విహార అనుమతులు అమెరికా రష్యా దేశములలోవలె ఇయ్యవలెను. విద్యావిషయమున మనమెంత ఖర్చుపెట్టి ప్రోత్సహించిన అంత

సుందరముగ భవిష్యత్తు రూపొందును. "Education must be the first charge of the Government."

పొలములు, తోటలు, వనములు, కర్మాగారములు, నీటిమరలు, విద్యుత్ యంత్రములు, భవనములు, ఆనకట్టమ వంతెనలు, కుటీరపరిశ్రమలు, రైల్వే స్టేషనులు జంక్షన్లు, హాంపి, అజంతా, ఎల్లోరా, అమరావతి, యాత్రలు, మన రాష్ట్రములోని కొన్ని ముఖ్య పట్టణములు, శాసనసభలు, న్యాయస్థానములు మున్నగునవి తప్పక బాలురకు చూప వలెను. బాలురు గొప్ప విజ్ఞానవంతులై దేశమునకు అమూల్యమైన సంపదగా మారుదురు. "Youth is our Country's wealth" (Pandit Nehru).

బేసిక్ పాఠశాలలు భవిష్యద్భారత పౌరులను తీర్చి దిద్దే మూసలుగా పోల్చవచ్చును. శిల్పి అందమును మాత్రమే ఇవ్వగలడు. దేవుడు ప్రాణము నివ్వగలడు. ఉపాధ్యాయుడు సంఘమున కవసరమగు సద్గుణములను ప్రసాదించును. అందు లకు అతనిని అద్వితీయ ద్వితీయ సృష్టికర్త బ్రహ్మయనియు, మహాశిల్పియనియు ఏల పిలువరాదు?

# ప్రణాళికయందు "ఆచరణ"కుగల ప్రాధాన్యత

—:0:—

విద్యార్థి అభ్యసించు ప్రతి విద్యావిషయము 'ఆచరణ' తోకూడి యుండవలెను. "Theory should go side by side with practice" నిన్న మొన్నటి వరకు అమలులోనున్న ప్రణాళికయందు సిద్ధాంతములకు విశేష ప్రాముఖ్యము నిచ్చి ఆచరణీయ భాగమును అలక్ష్యముచేసిన దాని పర్యవసానముగా విద్యార్థులు నేర్చిన విద్యయంతయు నిష్ప్రయోజనమైనది. జీవితమున కుపయోగపడు 'విద్యను' నేర్పక కేవలము 'ఉద్యోగ' సాధనకు వీలగు 'విద్య'ను నేర్పిరి. స్వయంపోషక సిద్ధాంతము ననుసరింపలేదు. ఉపాధ్యాయుడు బోధించు ప్రతి విషయము సాధ్యమైనంతవరకు ప్రయోగరీత్యా బాలురకు ఋజువుచేసి బాలురచే చేయించినట్లైన విషయములు సుబోధకము లగును. అట్టి ఆచరణీయాత్మకమైన విద్య బాలుని స్మృతిపథమునందు శాశ్వతముగా నిలిచిపోవును. ("Practical course of study trains them for life.") ఆచరణీయాత్మకమగు విద్య విద్యార్థిని భవిష్యత్ జీవనమునకు సిద్ధపరచును. ఇట్టి ఆచరణకు అవకాశము నిచ్చుటకుగాను కొన్ని సాంఘిక కృషులు, బేసిక్ విద్యా ప్రణాళికలో చేర్చబడినవి.

ప్రజాస్వామ్య సిద్ధాంతములను ఉపన్యాస పద్ధతిలో చెప్పుట వలన బాలురకెట్టి ప్రయోజనముండదు. పాఠశాలలో

సిద్ధాంతములు ఆచరణ నభ్యసించుటకు తగిన అవకాశములను కల్పించవలెను. నమూనా శాసన సభలను జరిపించుట చర్చలు సమావేశములు మొదలగునవి బాలురకు విశేషజ్ఞానము కలిగించును. తరగతి, వర్గనాయకుల ఎన్నికలద్వారా విద్యార్థి 'ఓటు' విలువను గ్రహించును. శాంతియుత చట్ట సమ్మతమైన వర్గాన ప్రతినిధుల ఎన్నికలు జరుపుట నేర్చుకొనును. ప్రభుత్వ వ్యవహారములు ఉపన్యాస పద్ధతి ద్వారా బోధించలేము. నమూనా ప్రభుత్వమును పాఠశాలయందు స్థాపించి, ఎన్నికలైన తర్వాత, ప్రతినిధులచే మంత్రివర్గమును యేర్పాటుచేసి, వారిచే ప్రభుత్వ వ్యవహారములు జరిపించవలెను. ప్రతికూల పక్షమును ఏర్పరచి మంత్రి వర్గాన్ని నిర్మాణాత్మక దృష్టితో విమర్శించుటను నేర్పవలెను. "Student is made to practise the democratic principles instead of merely teaching them" ప్రజాస్వామ్య జీవితమును విద్యార్థి ఆచరణలో పెట్టి సాధించుటచేత భావిజీవితములో అత్యుత్తమ పౌరుడుగా మెలగుటకు వీలుండును.

దీనిచే భావ్యున్నతికి సంఘశ్రేయస్సుకు అవసరమగు ప్రతివిషయమందును విద్యార్థి శిక్షణ పొందును. సహేతుక వాదనాశక్తి - నిర్మాణాత్మకమైన విమర్శనాదృష్టి - నెయ్యి మూర్గ్న ఉపన్యసించి గట్టిగా బల్లగుద్దిన వచ్చే విషయాలు కావు. పాఠ్యగ్రంథములను చదివినంత మాత్రాన మతసామరస్యత - సహకార సంఘీభావములు అర్థమగునా? పౌరధర్మ

ములను గట్టిగా వల్లెవేసి కంఠస్థము చేసినంత మాత్రాన సత్పౌరుడుగా విద్యార్థి ప్రవర్తింపగలడా? ప్రతివిషయమును గూర్చి పాఠశాలయందు శిక్షణ పొంది - ఆచరణలో పెట్టి సాధించిన గాని ప్రయోజనముండదు. బేసిక్ విద్యయందు విశేషముగ ఆచరణకు ప్రాధాన్యత ఇయ్యబడినది. క్రియాయుతాభ్యసనము ద్వారానే జ్ఞానార్జన జరిగినయెడల విషయములను మనము మరువరాదు. మానసిక శాస్త్రజ్ఞులు – పంచేంద్రియ శిక్షణద్వారా విద్య గఱపవలెను కనుక ప్రయోగశాలయందు ఆచరణకు వలయు అవకాశమును కల్పింపవలెను. లేనిచో మనము బోధించు విషయములు తాత్కాలికముగా బాలురు అరగు చేసికొన్నను త్వరలో వానిని మరచిపోదురు.

బేసిక్ విద్యాప్రణాళికయందు సహకార సంస్థలు న్యాయస్థానములు పోస్టాఫీసు మున్నగు కార్యక్రమములు చేర్చబడినవి. విద్యార్థులే సంస్థలను స్థాపించి నిర్వహించుట నేర్చుకొందురు. తమ బాధ్యతలను సరిగా గ్రహింతురు. [illegible] కష్టనిష్ఠురములను బాగుగా అనుభవము చేసికొందురు. అట్టి జ్ఞానము విద్యార్థి భావిజీవితమునకెంతో సాయపడునని వేరే చెప్పవలెనా? అన్నిటికన్న ముఖ్యమైన క్రమశిక్షణ విద్యార్థులు పాఠశాలయందే సాధించవలెను. 'క్రమశిక్షణ' లేనివారు సంఘములో యెట్టిదురవస్థల పాలగుదురో మనము నిత్యము చూచుచున్నాము గదా!

ములను సద్వినియోగము చేసికోవలెను. ముఖ్యముగా అందరికి అందుబాటులోనున్న సాధనము రేడియో. వినుటకు చెవులు, విందాము అను సంకల్పము, మనస్సు ఉంటే ఎంతేని జ్ఞానము నార్జింపవచ్చును. ద్రవ్యము ఖర్చుపెట్టక పార్కులోనికి పోయి వినవచ్చును.

సినిమాలు : వీనివలన మంచిచెడులు సమతూకములో లభించును. జాత్యభివృద్ధికి, విజ్ఞాన వికాసమునకు, కళాభివృద్ధికి తోడ్పడు సినిమాలను అరుదుగా చూతుము. ముఖ్యముగా "Boy Loving A Girl" సినిమాలు తయారగును. విద్యార్థులు అవిచూచి వానిని అనుకరించెదరు. ఎవరి నోటవిన్నా "చెలుని గని నిజమిదని" 'కలవరమాయె మదిలో' 'ఘోరి, ఘోరి — పాటలు' వినబడుతాయి. నిష్పాక్షికంగా చెప్పవలెనంటే నేటి సినిమాలు విద్యార్థులను ఎక్కువగా తప్పుడు దారిని పట్టించు సాధనములుగా నున్నవి. ఇంగ్లీషు చిత్రాలు చాలా బాగుండును. వానిలోని సృష్టివై చిత్రముల ఛాయాగ్రహణము, కథావస్తువు నీతి దాయకముగా నుండును. మన చిత్రములు నూటికి 90 నీతి బాహ్యమై అనుదాత్తమై అసహ్యముగానుండును. రష్యా అమెరికా దేశములో బాలురకుగాను ప్రభుత్వమువారు కొన్ని ప్రత్యేక చిత్రము లు తీసి విడుదల చేసెదరు. ప్రభుత్వ యాజమాన్యమున విడుదలయగు కొన్ని డాక్యుమెంటరీ చిత్రాలు, విదేశాలనుండివచ్చు కొన్ని చిత్రాలు పిల్లలకు బాగుండును. కొన్ని ఇంగ్లీషు చిత్రములు పరమ అసహ్యముగా "మానవుడు

పశువే" అని నిరూపిస్తాయి. youth festival. Gone with the wind, Samson and Dalilah. Battle of waterloo count of Mountecresto, Emilezola, Chota-Bai, Shaheed, 1942' Dr. Kotnis, మొదలగు చిత్రములు జ్ఞానార్జనకు తోడ్పడును.

మనము చూడని అడవి మృగములు, దివ్యమైన సౌధములు ఆకసమంటు న్యూయార్క్ భవనములు, నయాగారా జలపాతము, అమేజాన్ నది అందము, సముద్రఘోష, మంచుకొండలు, ఆరోహణకు సాధ్యముకాని కాంచనగంగా, గౌరీ శిఖరములు, కిరణ ప్రసారములేని కాఅడవులు, గొప్ప గొప్ప యంత్రాగారములు, అగ్నిపర్వతముల ఆర్భాటములు, వివిధ దేశస్థుల రూపురేఖా విలాసములు, ఆచారములు — ఎన్నో మనము అతిచౌకగా సులభముగా చూడనగును. సినిమాలు జాగ్రత్తగా చూడవలెను. మంచి సంపాదించుకొందామనిపోతే చెడ్డ బలవంతముగా మనలను వెంటాడుతుంది. అందుకు మార్గమొకటియే. ప్రభుత్వమే బాలురకుగాను కొన్ని చలన చిత్రాలను తయారుచేసి విడుదల చేయవలెను.

ఇప్పుడు ప్రతి పాఠశాలలోను 16 m m Movie తెప్పించినారు. ఇయ్యది బాలురకు విశేష విజ్ఞానమును చేకూర్చుచున్నది. ఇంకను ఎక్కువ విలువగల చిత్రాలు రావలెను. బాలుర కొఱకు ఎంతపాటు పడితే దేశానికి అంత మేలు.

# మ్యాజిక్ లాంతరు - (యక్షిణి దీపము)

.0:——

మ్యాజిక్ లాంతరును పల్లెలయందు —పార ఆరోగ్య విషయములను ప్రదర్శించుటకు ఆరోగ్యశాఖవారు వాడుదురు. ప్రతిపాఠశాలయందు దీనికి అవసరమున్నది. కొన్ని వేల (Slides ను పాఠశాల తెప్పించి విద్యాప్రచారమునకు, జ్ఞానార్జనకు తోడ్పడవలెను. సామాన్య రోగములు ఎట్లువచ్చును? వాని నివారణ గ్రామ పారిశుద్ధ్యము మున్నగు విషయములు తెలియును. బోధనకన్న, ఉపన్యాసములకన్న, మ్యాజిక్ లాంతరుచే ఎన్నోముఖ్య విషయములను సులభముగా బోధించవచ్చును. దీనికి ఖర్చు ఎక్కువ ఉండదు. ఇటువంటి దృశ్యసాధనముల ద్వారా ప్రపంచములోని అన్ని విషయములను చూపవచ్చును. జ్ఞానాభివృద్ధి యగును. ప్రయోజన విద్యాకేంద్రములలో దీనిని ఎక్కువగా వాడవచ్చును, ఏదైన వస్తువును చూచినప్పుడు దానిని మరచుటకు సాధ్యముకాదు. విన్నది తిన్నగా జారిపోవును. కావుననే దృశ్యసాధనములకు ఎక్కువ ప్రాముఖ్యత నీయవలెను. వానినుండి మనము ఎక్కువ విలువను పొందగలుగుదుము.

దృష్టికగోచరమగు సూక్ష్మ జీవుల రూపములను పటముల సహాయమున బాలురు చూడవచ్చును. అవి మనకెట్టి హానిని కలిగించునో సవిస్తరముగా తెలిసిన వాని నివారణకు

బాలురు జాగ్రత్తపడుదురు. అమ్మవారు పోయుట, మీాసల్స్, గజ్జి, తామర, స్కేబిస్, మలేరియా, ఫైలేరియా మొదలగు సూక్ష్మాతి సూక్ష్మమైన Bacili ను చూపించి బాలురను హెచ్చరింప వచ్చును

ప్రకృతిరమ్యమైన దృశ్యములను, కనివిని ఎరుగని స్థలములను, జంతువులను లాంతరు సహాయమున చూపవచ్చును. వీనియందు చూచు వస్తువులకు చలన ముండదు. అందుచే బాలురకు ఆకర్షణీయముగా ఉండక పోవచ్చును. గదిలో చూచుటకు వీలుండును. చలన చిత్రముల వలన నయాగారా, గంగా జలపాతములు కంటికి కట్టినట్లు కనపడును. అడవి మృగములు అరణ్యములలో సంచరించునది చూడవచ్చును.

పాఠ్యగ్రంథములోని అచ్చుబొమ్మలు దీనియందు పెట్టి పెద్దవిగా చూపవచ్చును. దానిని Epidio Scope అని అందురు.

# జాతీయపతాక

## ( పూర్వ చరిత్ర )

—:0:—

పతాక దేశప్రతిష్ఠకు ఒక చిహ్నము. మన ఔన్నత్యము, సాంప్రదాయము చరిత్ర, సంస్కారములు, ఉన్నతాదర్శములు, అనేక కోట్లకొలది ప్రజలు చేసిన మహత్తర త్యాగములు మనకు స్ఫురింపజేయును. ఇది జాతి, మత, వర్ణ, వివక్షతల కతీతమైన ప్రజాస్వామ్య లౌకిక ప్రభుత్వమునకు చిహ్నముగా నున్నది.

మనపతాకకై లక్షలాది నాయకులు అత్యుత్సాహముతో నురికంబాల నెక్కిరి. తమ వేడినెత్తురును జాతీయ పతాకకై అర్పణచేసినారు. మరఫిరంగుల మారణధ్వానమును పెడచెవిని బెట్టి మృత్యువునకు జడియక వీరాధివీరులైన నాయకుల త్యాగ ఫలితమే మన పతాక. నెత్తురు కాలువలుగట్టి మహాభయంకరముగా ప్రళయకాల రుద్రునివలె బ్రిటిషుసామ్రాజ్య పిశాచము తాండవించిన రోజులలో నిర్భయముగా "భారత్ మాతకి జై"—"జాతీయ పతాకానికి జై" అంటూ తుపాకి కాల్పులకు బలియైరేకాని చేతనున్న జెండాను మాత్రము వదలలేదు. చేతులు అలా నిశిత కరవాలముల కాహుతియైనను సరే, జండాను వదలక వేలకు వేలు స్త్రీలు హతమై వీర స్వర్గము నలంకరించిరి. ఆనాడు ఎంతో ధైర్యసాహసము లున్న

వారే పతాకను ఎగురవేయగలిగిరి. ఈనాడు ఎందుకు పనికిరాని పిరికిపందలుకూడ నిర్భయముగా స్వేచ్ఛగా ఎగుర వేయు చున్నారు. ఒకనాడు పతాక కొరకై మహత్తర త్యాగ ములు చేసిన మహానుభావుల చరిత్రలు స్మరించి దానియొక్క విశిష్టత గోచరమగును. ఒక్కొక్క అడుగు పతాక పైకి ఎగురుటకు కొన్ని వేలమంది తమ పచ్చినెత్తురును వెదజల్లి సర్వస్వము త్యాగము చేసినారు. అటువంటి పవిత్ర పతాక, ఆదర్శ పతాక అలాగే ఎగురుచుండవలెను. దాని ప్రతిష్ఠకు, ఆదర్శములకు లోపము రాకుండుటకుముందు సంతతివారుకూడ అంతటి త్యాగము చేయుటకు సంసిద్ధులు కావలెను. ఏదో మూడు రంగుల గుడ్డముక్కని భావించక పతాక పవిత్రతను బాలురకు బోధమగునట్లు చేయవలెను.

1885 కాంగ్రెసు స్థాపన. అలెన్ హ్యూమ్

1905 ప్రథమముగా పతాక నిర్మాణము.

1906 బెంగాల్ విభజన — లార్డు కర్జను గవర్నర్ జనరల్ — జాతీయోద్యమమునకు నాంది జరిగినది.

వంగరాష్ట్ర ఐక్యతకొరకు పోరాటము జరిగెను అప్పుడు పతాకను నాటినారు. (బాల్, లాల్, పాల్) తిలక్, లజపతి రాయి, బిపిన్ చంద్రపాల్ ముగ్గురును తీవ్రముగా కృషి చేసినారు.

మొదలు కాషాయరంగులో 8 నక్షత్రములు, తెలుపు రంగులో "వందేమాతరం" అను అక్షరములు, ఆకుపచ్చలో సూర్యచంద్రులు చెక్కబడినవి. అనిబిసెంటు — తిలక్ గారి Home Rule ఉద్యమును 1916 లో ఒకమూలన బ్రిటీషు పతాకమును చేర్చి 5 ఎర్రనివియు, 4 ఆకుపచ్చనివి, సప్త ఋషులు తెలుపు 7 నక్షత్రములు చేర్చిరి.

1921 లో గాంధీగారి నాయకత్వము — ఖాదీ ఉద్యమమునకు చిహ్నముగా చర్కాను, 3 రంగుల జెండాను ప్రతిష్ఠించిరి. ఎరుపు, ఆకుపచ్చ, తెలుపు రంగులు పతాకలో చేర్చిరి.

1931 భోగరాజు పట్టాభిసీతారామయ్యాగారి కమిటీ వారు-కాషాయరంగును ఎరుపునకు మార్పుగా చెర్చిరి. కాషాయరంగు—త్యాగమును, తెలుపురంగు పవిత్రతను, ఆకుపచ్చ రంగు-అభివృద్ధిని సూచించునని నిర్వచించిరి. 1931 — 15–8–1947 వరకు కాంగ్రెసుపార్టీవారి జెండాగా పనిచేసినది 15–8–1947 తేదీన పతాక మధ్యగ నీలిరంగులో అశోకచక్రము నిర్మించిరి. పతాక 3:2 నిష్పత్తిలో నుండు నట్లు తీర్మానించిరి ఈ చక్రమున 24 ఆకులు ఉండవలెను దీనిని ధర్మచక్రమని పిలుతురు. సత్యము, అహింస, ధర్మము దయ అను పవిత్రధర్మములకు పతాక చిహ్నమని గ్రహింపవలెను.

జాతీయ పతాకకు ప్రాణప్రతిష్ఠ చేసినది ఆంధ్రుడే అని మనము గర్వించవలెను.

త్రివర్ణములు సత్త్వరజస్తమోగుణములను తెలియపఱచు నని డాక్టర్ రాధాకృష్ణ పండితుడు నిర్వచించినాడు. ధర్మ సంస్థాపన మనలక్ష్యముగా ఈ "అశోకచక్రము ప్రకటించునని" జవాహర్‌లాల్ వక్కాణించినాడు.

"జెండా ఊంచే రహే హమారా"......

## : పతాకను గురించి కొన్ని వివరాలు :

—:O:—

1. కాషాయి రంగు పైకి ఉండవలెను.
2. పతాకము కట్టచివరకు లాగవలెను.
3. సూర్యోదయమునకు పూర్వము, సూర్యాస్తమయమునకు తర్వాత జెండా ఎగురరాదు.
4. జెండాను పైకిలాగునప్పుడు అతిచురుకుగా, గౌరవనీయముగా లాగవలెను. దించునప్పుడు నెమ్మదిగా దించవలెను.

5. ఎగురవేయుటకు తప్ప మరేదనికి ఉపయోగింపరాదు.
6. జెండాపైన అక్షరములు, అలంకారములు చేయరాదు.
7. జీర్ణమైనతరి, లేక రంగులు కలిసిపోయినప్పుడు జెండాను గౌరవ పూర్వకముగా ఒక మూలకు తీసికొనివెళ్లి ఏకాంత ప్రదేశమున నిప్పు పెట్టవలెను.
8. వందన పూర్వకముగా జెండాను ఎవరిముందర ఉంచరాదు.
9 జెండాను నేలకు తగులనివ్వరాదు.
10. జెండాను ఎగుర వేయునప్పుడు, దించునప్పుడు ప్రక్కనున్న వారు కదలరాదు.
11. పతాకరంగు గుడ్డలను ధరించరాదు.
12. విచారమును సూచించుటకు జెండాను కర్రసగము వరకు లాగి కట్టవలెను.
13. జెండా అధ్యక్షునికి కుడివైపున ఉండవలెను.
14. కొన్ని జెండాల జతలో ప్రదర్శించునప్పుడు మన జెండాను అన్నిటికి కుడివైపున ఎత్తుగా అమర్చవలెను.
15. తోరణముగా ప్రేలాడ దీయునప్పుడు కాషాయరంగు ఉత్తరముగాగాని, తూర్పుగాగాని ఉండవలెను.
16. 'జన గణ మన' పాట ముగిసిన తర్వాత నిశ్శబ్దముగా మాట్లాడక వెళ్లిపోవలెను.

త్వము, సహనము, అంతర్జాతీయత, శాంతి, మానవాభ్యుదయము అభివృద్ధిపొందుటకు, ఈ

సం ______ ______ నెల ______ తేదిన, ఈరీతిగా రాజ్యాంగ సుస్థిరతకు మేము హృదయ పూర్వకముగా ప్రమాణము స్వీకరించుచున్నాము.

---

## అధ్యాపకుడు.

—:0:—

ఉపాధ్యాయుడు మహామేధావిగాను, దయాస్వభావుడుగాను, ఎల్లపుడును చిఱునవ్వు చిందులాడుచు తల్లితో సమానముగ బాలుర ప్రేమించి, లాలించి విద్యాబుద్ధులు గఱపవలయును.

"గురుబ్రహ్మ గురుర్విష్ణు గురుర్దేవో మహేశ్వరః।
గురు స్సాక్షాత్ పరబ్రహ్మతస్మై శ్రీ గురు వేనమః॥

అని చెప్పబడినది. నేటివిద్యా వేత్తలు ఉపాధ్యాయుడు దేశ నిర్మాత, అంతర్జాతీయ శాంతిదాత అని నిర్వచించినారు.

"The teacher is the builder of the nation and the promoter of the world peace"

భవిష్యద్భారతదేశము పాఠశాలలను మూసలో ఉపాధ్యాయునిచే రూపొందింపబడుచున్నవి. నేటి విద్యార్థులు రేపటి పౌరులు. వారి మనో వికాసములపై, హృదయ విశాలతపై, నాగరికత, సంస్కారములపై దేశౌన్నత్యము, ప్రపంచశాంతి ఆధారపడియుండును. అటువంటి విశ్వ పౌరలను సృష్టించెడి, బేసిక్ విద్య ఆధ్యాపకుని బాధ్యత ఎంతటి మహత్తరమైనదో చూడండి. పౌర ధర్మశాస్త్రమును, ప్రజాస్వామ్య, సిద్ధాంతములను బాలురకు బోధించవలెను. ఉత్తమ ఆశయములు, ఆదర్శములు కలిగియుండ వలయును. అనేక విషయములు, అవగాహన చేసికొని, జీర్ణించుకొని, వానిపై చక్కని నిర్దుష్టమైన స్వాభిప్రాయములు పొంది యుండవలయును. చంచలమైన మనోభావములను, దృఢము చేసికొనవలయును. అనేక గ్రంథములు పఠించవలయును. నిశ్చితాభిప్రాయములు లేనియెడల నితరులతో ప్రసంగించ రాదు. మానసిక అవేశములకు, ఉద్రేకములకు తావీయరాదు. సముద్రమురీతి ప్రశాంతత అవసరము. "Teachers are walking libraries"— అన్నాడు Hazlit.

'తాను ఆడలేక మద్దెలవానిని నిదించు' పద్ధతిని ఉపాధ్యాయుడు, చెప్పలేక విద్యార్థులు శుద్ధ మొద్దు వెదవలు. అని నిందించరాదు. మన్ను అంతా ఒకటే— కాని [illegible]

చాతుర్యములోనున్నది సృష్టి కళావైభవము. అనేక రకము లైన మంగళకరములగు వస్తువులుకాని అమంగళకరములగు వస్తువులు కాని సృష్టింపవచ్చును. విద్యారాని శిశ్వబ్రహ్మ చేతికి ఎంతటి శ్రేష్ఠమైన బంగారమునిచ్చిన నేంతో మనకు నంతే ఉపయోగము కాన ఉపాధ్యాయుడు దీక్షతో పని చేసిన వెయ్యారు మహాత్మాగాంధీలను, నూరారు నెహ్రూలను శివాజీలను, ప్రతాపరుద్రులను, కాళిదాసులను, సృష్టింపవచ్చును. నాథూరాంగాడ్సేను గాని, మహానాయకుడగు మహాత్మా గాంధీగారినిగాని సృష్టించినది ఆ ఉపాధ్యాయుడే. న్యూటన్ ను గాని మొజార్టునుగాని తయారు చేయవచ్చును. అందుకు ఉపాధ్యాయుడు అద్వితీయ ద్వితీయ సృష్టికళా బ్రహ్మయను టలో ఆశ్చర్యమేమున్నది. The future of the country is in your hands అన్నాడు గాంధీగారు. అటువంటి ఉపాధ్యాయుడు సత్ప్రవర్తనగలిగి సంఘమునకు ఆదర్శకుడై నడచు కొనవలయును. ఇంజనీర్లు రాళ్ళను మలచి భవనముల నిర్మాణమునకు తోడ్పడుదురు. పరిపాలన ప్రజల నడవడిపై నాధారపడియుండును. దక్షిణాఫ్రికా యడవిలో ఎంతచక్కని ఆదర్శమైన రాజ్యాంగమును అమలు పఱచి ఏమిలాభము! రాజ్యాంగమును అమలు జరుపుటకు నాయకులు ఎంత శ్రమ పడినను, బూడిదలో పోసిన పన్నీరగును. సత్పౌరులను తయారు చేయడము ముందుగా జరుగవలెను. ఉపాధ్యాయుడు సజీవ వస్తువులను సంస్కరించు కళామూర్తి. కడుజాగ్రత్తగా పనిచేయవలెను. వస్తువు చెడిపోయిన మరొక వస్తువు

దొఱకును అనుటకు వీలులేదు. ఒక గాడ్సె చెడిపోయినందుకు అంతక్షోభ కలిగింది. జాతిపితను గోల్పోయింది దేశము.

విద్యార్థులను పరీక్షలయందు ఉత్తీర్ణులచేయుడమే పరమావధి అని తలంచరాదు. జీవితమను అగ్నిపరీక్షను ఎదుర్కొనుటకు విద్యార్థులను సంసిద్ధపరచుటయే ఏకైక లక్ష్యముగా నుండవలెను. Teaching is largely a matter of the personality of the teacher (panton) విద్యా బోధన అధ్యాపకుని ప్రజ్ఞా ప్రాబల్యముపై నెక్కువ ఆధారపడియుండును. ఉపాధ్యాయుడు మంచి నాయకుడుగా నుండవలెను. ప్రజాస్వామ్య సిద్ధాంతములను అభ్యసించుచు విద్యార్థులకు ఆ సిద్ధాంతములను బోధించవలెను. ఏదైన నొకపనిని తాను ప్రారంభించి బాలురచే చేయించవలెను. విద్యార్థులను శిక్షణయందుంచుటకు తగిన నేర్పు కలిగియుండవలయును. పరేంగిత జ్ఞానము గలవాడుగా నుండవలెను. తన బాలురయెడ సానుభూతి కలిగియుండవలెను. ఉపాధ్యాయునికి మంచి సమయోచిత ప్రజ్ఞ యుండవలెను. శాంతి సహనములు, పట్టుదల సంఘీభావము కలిగి కడు మెలకువతో ప్రవర్తించవలెను. ప్రతి అవకాశమును సద్వినియోగపఱచవలెను. విద్యార్థులతో కలిసి మెలసి తిరుగవలయును. ఉపాధ్యాయుడు తన్నుచూచి ప్రేమించునట్లు నడచుకొనవలయును. "ఆ పలుకెంత తీపియో" అన్నట్లు అమృతమయమగు వాక్కులచే బాలుర రంజింపజేయవలెను. వారి దృష్టిలో ఉపాధ్యాయుని వాక్కులు

మిక్కిలి స్పష్టముగా గోచరించుచుండును. భయమును అసహ్యమును జనింపజేయరాదు. ఉత్సాహమును కలిగించవలెను, కొందరు ఉపాధ్యాయులకు అరే, మంచిది, అవునులే, అను ఊత పదముల వాడుక యున్నది. అట్టిదికాని మరే విధమైన వ్యక్తిగత దురభ్యాసములను విద్యార్థులయెడ కనపఱచరాదు. పరిశుభ్రతయందు ఆదర్శకుడుగా మెలగవలెను. 'The Student imitates much from the teacher'' Maurice Harrison. ఉపాధ్యాయుడు ఎంత జాగ్రత్తగా నడచుకొంటే బాలుర అభ్యుదయమునకు అంతగా తోడ్పడును. సాధారణముగా తప్పులు లేదా తప్పుడు అభిప్రాయములను, చెప్పరాదు. పొరపాటున జరిగినచో ఆతప్పును సవరించుట మంచిదికాని సమర్థించ ప్రయత్నించరాదు. తెలియని విషయము, "నాయనా నాకు తెలియదు, చూచి చెప్పెదను''. అని చెప్పవలెను. అట్లుగాక తన ప్రతిష్ఠకు భంగకరమని, తన పరువునకు హాని కలుగునని తలచి బాలురకు పసివారికి తన్ను నమ్మి ఆరాధించువారికి విషము త్రాపరాదు. మనకు బయటివారిపై కోపమువచ్చిన (మ్యానేజరు - హెడ్మాష్టరు) ఆ నెపమును బాలురపై చూపరాదు. "ఓరి కూర్చో మొద్దు వెధవా" అని కఠినముగా ప్రవర్తించువాడు ఉపాధ్యాయుడుకాడు. అప్పుడప్పుడు ఆత్మ విమర్శన చేసికొనుచుండవలెను. నేను చెప్పిన పాఠము అందరికి అర్థమయినదా లేదా? పాఠ్యప్రణాళికలో నిదేకదా? పాఠముయొక్క లక్ష్యము చెప్పినానా? విద్యార్థులు ఏమినేర్చిరి? మున్నగు ప్రశ్నలు వేసి

కొని బోధన చేయువలయును విషయముల మూలసూత్రము లను, సిద్ధాంతములను, పునాదులను, తాను బాగుగా అర్థము చేసికొని వస్తు నిర్దేశాంశముల సాయమున విద్యార్థు లకు చెప్పవలెను. తనకు తెలియనిది చెప్పరాదు. గర్వించ రాదు. తన జ్ఞానమును నవీనముగా ఉంచుకొనవలెను. ప్రతి క్షణము, మారుచుండు ప్రపంచ పరిస్థితులను జాగ్రత్తగా పరి శీలించుచు విద్యార్థులకు చెప్పవలెను.

ఎక్కువ గ్రంథపరిచయము అలవాటు చేసికొనవల యును, వార్తాపత్రికలను తెప్పించి తానుచదివి, బాలురచే చదివించి ముఖ్యాంశములను దినచర్యపుస్తకమునందు, వ్రాయిం చవలెను. శాసనసభలు నమూనాలు జరుపుటకు శాసనసభా నిర్వహణ ఒకసారి చూచిరావలెను. నాయకులకు ఎన్నిక లందు బాలురు ఉద్రేకములు కలిగి, కలహించుకొన కుండా చూడవలెను. సహకారసంస్థలు, ఉద్యమములు జరుగు విష యములలో జాగ్రత అవసరము, బాలురకు ఎంత బాధ్యత అప్పగించిన అంతమేలు. నేర్పునది యంతయు ఉపాధ్యా యుని శక్తిసామర్థ్యముపై ఆధారపడి యున్నది.

రాజకీయ సిద్ధాంతములను చర్చించు నపుడు నిష్పా క్షిక, బుద్ధిఅవసరము. తన అభిప్రాయములను బలవంతముగా బాలురపై రుద్దకూడదు. విధ్యార్థులకు మంచి సంఘశిక్షణ నివ్వవలెను. ఒక్క మాటలో ఉపాధ్యాయుడు గొప్పసంస్కా రము కలిగి ఉండవలెనని చెప్పవచ్చును.

# యీ శ్లోకముల భావము గ్రహింపుడు

—:0:—

ఓం గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరబ్రహ్మ
తస్మై శ్రీగురవేనమః—

అఖండ మండలాకారం
వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితం యేన
తస్మై శ్రీ గురవేనమః

బ్రహ్మానందం పరమ సుఖదం
కేవలం జ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం
తత్త్వమస్యాది లక్ష్యం

ఏకం నిత్యం విమల మచలం
సర్వాధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణ రహితం
సద్గురుం తం నమామి.

———

ఓం అసతో — మా — సద్గమయ

తమసో మా జ్యోతిర్గమయ

మృత్యోర్మా అమృతంగ మయ

ఓం సహనావవతు సహనౌభునక్తు

సహవీర్యం కర వా వ హై

తేజస్వి నా వధీ తమస్తు

మా విద్వి షా వ హై.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః